# శుభాశీస్సులు



## అఖిల భారతీయ కాంగ్రెసు కమిటి

టెలిఫోన్: { 40320
{ 45870

నయీ ఢిల్లీ
జులై 19, 1957

ప్రియ భాయిశ్రీ

ముఝే ప్రసన్నతా హై కి తెలుగు భాషా మేఁ "ప్రథమ స్వాతంత్ర్య సమర చరిత్ర" నామక గ్రంథ 15 అగస్త మహోత్సవ కే అవసర పర్ ఆప్ ప్రకాశిత కర్ రహే హైఁ. ముఝే విశ్వాస హై కి ఆప్ కా యహ గ్రంథ తెలుగు భాషా భాషీ పాఠకోఁ కో సమాజ నిర్మాణ కే కార్య మేఁ అగ్రసర్ కర్నే కేగా ఔర్ లోగ్ ఉతనేహీ ఉత్సాహ కే సాథ్ జుట సకేఁగే జితనా కి ఉన్హోఁనే స్వతంత్రతా కే సంగ్రామ మేఁ దిఖాయా హై.

మేరీ శుభ కామనాయేఁ ఆప్ కే ప్రకాశన కే సాథ్ హైఁ.

ఆప్ కా
ఉ. న. దేబర్

శ్రీ గుర్దేటి వీరసుబ్రహ్మణ్యం
సంచాలక్, జాతీయ విద్యాపీఠ్
గూడూరు (నెల్లూరు) ఆంధ్ర ప్రదేశ్

# చిరసంస్మరణీయులు

*

దక్షిణకాశీ శ్రీకాళహస్తీశ్వర క్షేత్రమున ధర్మశాలను గూడూరులో శ్రీ మూలస్థానేశ్వరునికి కల్యాణ మంటపమును శ్రీరామ మందిరమును నిర్మించి హిందూ మతాభిమానం జూపెట్టిన భక్త శిఖామణి, గూడూరు నగరంలో ప్రప్రథమంగా తనపేరట 'పార్కు' ను నెలకొల్పించియు, ఏ. ఆర్. క్లబ్బు భవన నిర్మాణమునకు తోడ్పడియు పౌర సేవాసక్తిని ప్రదర్శించిన వదాన్యులును, జాతీయాభిమాన కార్యకలాపాలలో లలితకళాపోషణలో యథాశక్తి సహాకరించిన మైకా వణిక్పుంగవులునగు కీ. శే. చేశెట్టి వెంకట రామయ్యశెట్టిగారి జ్ఞాపకార్థం ఈ శతాబ్ది మహోత్సవమును పురస్కరించుకొని వారి సుపుత్రులు శ్రీయుతులు **పి. రామచంద్రరావుగారును, శ్రీ పి. వెంకటకృష్ణయ్యగారు** ఈ గ్రంథ ముద్రణాన్వయము నత్యంత పూజ్యభావముతో భరించి తమ జాతీయాభిమానాన్ని వెల్లి గొల్పినందులకు వారికిన్ని వారి కుటుంబమునకున్ను పరమాత్మ మహదైశ్వర్యయుత చిరాయురున్నతుల ప్రసాదించి భవిష్యత్తున ఈలాంటి మహత్తర కార్యములతో చరిత్రను పునీతము చేసికొనగల వితరణౌదార్యభూషితుల చేయుగాత.

**అసతోమా సద్గమయ - తమసోమా జ్యోతిర్గమయ**
**మృత్యోర్మా అమృతంగమయ.**

గుద్దేటి వీరసుబ్రహ్మణ్యం
రచయిత.

# వీ ర పూ జాం జ లి

*

భారతేతిహాసములో
తన త్యాగమయ పవిత్ర జీవితముతో
ఆ జన్మం ఆంధ్రుల ఏకైక నాయకుడై
స్వాతంత్ర్య సమరయోధ కర్ణధారియై
ఆంధ్రజాతికి ఒక అపూర్వ చరిత్ర సృష్టించిన
**అమరవీరుడు ఆంధ్రకేసరి ప్రకాశం**
శ్రీ చరణయుగళి సన్నిధి పూజాపుష్పముగా
ప్రథమ స్వాతంత్ర్యసమర శతాబ్ది మహోత్సవ
సమయమున నీ గ్రంథము సమర్పితము.

* * * *

నలుపదేండ్ల పూర్ణాహుతి దెలుగునాట
దళియరానన్ని యిడుమల దగిలిబాగిలి
నిష్కళంక నిస్స్వార్థ మసీమచిత్త
మెత్తువడలేమ జీర్ణవికీర్ణమయ్యు
ఇవిగో నా నమస్సులు స్వీకరించుబాబు!

గుద్దేటి వీరసుబ్రహ్మణ్యం

# శ్రద్ధాంజలి

*

వీరనారీ శిరోమణి

ఝాన్సీ మహారాణి లక్ష్మీబాయికి

—★—

అమ్మా! నీదు చరిత్ర హైందవుల
కాత్మోత్సుకత్వముఁ గూర్చి గ
ర్వమ్మై జాతికి నిండు గౌరవము
సంపాదించి పాశ్చాత్యులే
సమ్మానింపగ శ్లాఘ్యపాత్రమయి
విశ్వవ్యాప్తమైపోయె; గై
కొమ్మా సోదరులిచ్చు పూజనల
నీకోర్కుల్ ఫలించెఁ రహిన్,

గుద్దేటి వీరసుబ్రహ్మణ్యం

ప్రథమ స్వాతంత్ర్య సమర జ్యోతి



వీరమాత

ఝాన్సీ లక్ష్మీబాయి

## ప్రథమ స్వాతంత్ర్య సమర మహారథికులు



నానాసాహెబు పద్నవీసు



ఝాన్సీ మహారాణి



మొగలు చక్రవర్తి బహదూర్‌షా

# నా నివేదనము



సోదర సదస్యులకు పాఠకమహాశయులకు జాతీయ విద్యాకుటీర గ్రంథమాల పక్షమున ప్రథమ స్వాతంత్ర్య సమర శతాబ్ది మహోత్సవమునకు నేను చిఱుపొత్తమును వీరపూజా ప్రసూనంగా సమర్పిస్తున్నాను. ఇయ్యది నా రచిత స్వాతంత్ర్య సమర చరిత్రలోనున్న భాగమును ఇంచుక మార్పులుకూర్పులతో సంస్కరించి ప్రచురించుచున్నాను.

సహృదయుల సహకారం సదా అపేక్షితమే.

కృతజ్ఞత:— కోరినంతనే శ్రమయనుకొనక తమ అమూల్య ఆశీస్సులందజేసి గ్రంథమునకు అపూర్వగౌరవం ప్రసాదించిన పరమపూజ్యులు అఖిలభారత సంఘాధినేత శ్రీ ఉ. నవలశంకర్ దేబర్ గారికి ఆజన్మం కృతజ్ఞుడను. వారికి నానమోవాకములు.

ఈ గ్రంథమును జాతీయాభిమానం మాతృభాషాభిమానం దనిపి స్వీకరించి నన్నుత్సాహ పఱుచ ఉదారుల ప్రేమపూర్వకముగా ప్రార్థిస్తున్నాను.

జయ్ హింద్

గుద్దేటి వీరసుబ్రహ్మణ్యం
సంచాలకుడు
ఆగష్టు 15, 1957

జాతీయ విద్యాకుటీర—
గ్రంథమాల
గూడూరు, నెల్లూరు.

# విషయ సూచిక

*

సత్యమ్ శివమ్ సుందరమ్

# భారతమాతృవందనమ్

★

వందే మాతరమ్
మాతరమ్ వందే మాతరమ్
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం, వందే మాతరమ్
శుభ్రజ్యోత్స్నాం పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరమ్, వందేమాతరమ్

మాతరం వందే మాతరమ్.

---

"స్వదేశాభిమానము ఆత్మాభిమానములేని మానవుడు మానవజన్మ కాజాలడు, కేవలం పశుతుల్యుడున్నూ కాడు; జీవచ్ఛవమాత్రుడు"

—గణేశశంకర విద్యార్థి.

# మాతృవందనమ్

"కంటిలోపలిపాపగా నిల్చుదానిని
ఆత్మపుష్పసుగంధ మైనదాని;
బ్రతుకుపేటికిని జీవన భూతియగుదాని;
మేనుగీమున దివ్వెయైనదాని;
అతులమానస సరోహంసిక యగుదాని
నెత్తుటికిఁ వేడి నిలుపుదాని:
పొలుపొందు ముకుపుటంబుల గాలియగుదాని
మట్టిపూవున బొల్చునట్టిదాని:
కామధేనువు చందాన గాచుదాని
ప్రేమ నిత్యార్ద్రమగునట్టి ప్రేవుదాని
నాకు నా పూర్వజులకు జన్మంబు నొసగి
నట్టిదాని, భరతమాత నాత్మదలతు."

— బోనుభారతము.

"జననీ జన్మ భూమిశ్చ
స్వర్గాదపి గరీయసి"

# భారత పూర్వచరిత్ర సింహావలోకనం



౧

రెండువేల సంవత్సరములకు పూర్వమే భారతవర్షం ప్రపంచం నాలుగుచెఱగులా తన విజ్ఞాన కీర్తిచంద్రికల వ్యాపింపజేసి సర్వసంస్కృతుల కాటపట్టనే అఖండప్రతిష్ఠ సముపార్జించుకున్నది. నాడు మనది స్వర్ణయుగం. విశ్వ శాంతికి అనుపమానుభూతుల రూపొందించింది. ఖండఖండాంతర జ్ఞానతృష్ణాతురులైన విద్యార్థుల నాకర్షించి దర్శన శాస్త్రాలను పురాణేతిహాసాది స్మృతులను నాస్తిక ఆస్తికాది మతతత్వ సిద్ధాంతీకరణాలను అర్థకామశిల్ప అలంకారాది శాస్త్రాధ్యయనములతో కూడిన చతుష్షష్టికళల విద్యాప్రబోధాలతో నానాదేశాచార విచార వ్యవహారాల సంశోధించి ప్రాచీ ప్రతీచీ విజ్ఞానవల్లికల సమ్మేళనమొనర్చి విజ్ఞానపు వెలుగుబాటల దీర్చిన, నలందా – తక్షశిలా – కాశీ – గయా వైశాలీ – ఉజ్జయినీ – పాటలీపుత్ర – తామ్రలిప్తి – కాశ్మీర ధాన్యకటక – వేంగీ – కన్యాకుబ్జ – మధురాది ప్రాచీన విద్యాపీఠము లానాడు అత్యద్భుత విజ్ఞాన కేంద్రాలుగా ఉత్కృష్ట నిగూఢ జ్ఞానప్రదీపనాలుగా ధర్మాధర్మ నయతత్వ విచార ప్రబోధకాలుగా అతిప్రాచీన సంస్కృతిపరిశోధనా

గారాలుగాకూడా మహాపూజ్యతనుగన్నవి. మన్ననలందు కొన్నవి. కాని ఆ అమరస్మృతులు బౌద్ధారామశిథిలాలు, విశ్వశాంతిప్రదాత అశోకసార్వభౌముల శిలాశాసనా లవశే షంకాగా కాలగర్భంలో విలీనమైపోయినవి.

2

విదేశీయుల దండయాత్రలకు గురియైపోయిన భారతా వని స్వదేశ సంస్థానాధీశ్వరులలోని అంతఃకలహాలకు ఈర్ష్యా ద్వేషానలాలకు బలియై ఆత్మస్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోలేక పోయింది. గుజరాతు సోమనాథేశ్వరుని పవిత్రమూర్తి భిన్నా భిన్నంకావడం గజనీమామూదుగోరీ బలపరాక్రమాలచేత కాదు, కేవలం హిందూరాజన్యులలో నాడు ప్రజ్వరిల్లుచుం డిన అంతఃకలహ వజ్రకుఠారంవల్లనే. అది భారతీయుల దౌర్భాగ్యం. శౌర్యధైర్యస్థైర్య బహుముఖ పరాక్రమాలే సహజసంపదలుగా దిగంతకీర్తిప్రతిభలతో విరాజిల్లిన క్షత్రి యవంశంలో దురహంకారం ఎందుకు పొడచూపుతుంది? నిరంతరం ఒండొరులపై కత్తిదూయడం ఎందుకు ప్రాప్తి స్తుంది! ఒకరి పరాభవాన్ని మరియొకరేల కాంక్షిస్తారు?

3

వేలొద్దిమంది మంగోలియన్ యోధులతోనో ఎత్తి వచ్చిన బాబరుబాదుషా 'ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా' అనే అత్యున్నతస్థాయి నందుకొనియున్న ఢిల్లీపట్టణములో జిమ్మవే

మొగలగడ్డ మొగలు సామ్రాజ్యానికి బునాదులు వేయడం ఇందుకు విమర్శనదృష్టితో పరిశీలించాము. మన స్వదేశ ప్రభువు లెంత నిర్జీవులైపోయారో చేజేతులా మహానర్థం తెచ్చిపెట్టుకున్నారో బోధపడుతోంది. నాటి స్వాతంత్ర్య హననము ప్రత్యేకత కాదు. అనైక్యతాకారణం ఈర్ష్యాద్వేషాల విచ్ఛిత్తి ప్రభావమూలాన్నే హైందవజాతికి పరాధీనత ప్రాప్తము కొన్నది. మహారాణాసాంగా అత్యద్భుత సాహసంతో తన ప్రాణాలనొడ్డి పోరాటంసాగించాడు. మొగలాయి యోధుడు బాబరు గుండెలు తల్లడిల్లినాయి. కాని అంతిమక్షణంలో దేశద్రోహుల మద్దత్తు తురుష్కవిజయానికి కారణమయ్యింది. భారత చరిత్రగతి మారిపోయింది.

అత్యంత విరుద్ధపద్ధతులతో సాగు హిందూ మహమ్మదీయ సంస్కృతుల పరస్పర సంక్రమణం దాపురించింది. కానిసభావాల కమ్ముకుపోయి రాజపుత్రులే ముస్లింసంపర్కమనే ఊబిలో దిగబడిపోయారు. అక్బరుబాదుషా మత తంత్రాంగం ముస్లింలకు మంచిభవిష్యత్తు చేకూర్చింది. మతాంతర వివాహాల శంకంద్వారా మహమ్మదీయులకు పౌరసత్వ హక్కులు భుక్తములయినాయి. ప్రజాస్వామ్యంలో నాడు వారున్ను భాగస్వాములైనారు. చివరకు భారతీయులైనారు.

౨

భారతావనిలో మహమ్మదీయ మత ప్రాచుర్యానికి సనాతనాచార పరాయణుల పాషండత్వం ఒకతోడ్పాటుగా

హిందూమతానికి తీరని అపచారం చేసింది. ఏదో మానసిక దౌర్బల్యంవల్లనో ఆర్థికమాంద్యంవల్లనో లేదా మతావేశ బలాత్కారంవల్లనో మతాంతరుడుగావింపబడ్డ హిందువునకు మరల సంఘంలో స్థానం లభించేదికాదు, పైగా ఆవ్యక్తిపై కఠిన సంఘబహిష్కారం ప్రయోగింపబడేది. మతభ్రష్టుడుగా గర్హించబడేవాడు. ఈసంఘదౌర్బల్యాన్ని పసికట్టిన ఔరంగజేబుబాదుషా తన అమానుషిక చర్యలద్వారా వేలలోనుండిన మహమ్మదీయుల సంఖ్యను లక్షలదాకా పెంచగలిగాడు. పునః హిందూమతస్వీకరణాని కవకాశంలేని కారణాన కుటుంబాలకు కుటుంబాలుగా అన్యమతస్వీకరణ విధిగా చేపట్టవలసి వచ్చింది. అసంఖ్యాకులకును హిందూమతం గోల్పోయింది. లౌకికదృష్ట్యా హిందూమతం బలహీనపడింది. అన్యమతాల పోకడలలోగల మతప్రాచుర్యాన్ని వ్యాప్తిని గుర్తించలేక పోయింది. నేటి సంకరస్థితికి లోపమొక్కటే!

నాడు భారతదేశంలో ముష్కరతురుష్క దురహంకారాన్ని నిరంకుశ మతాంతీకరణాన్ని ఎదిర్చి సర్వ స్వతంత్రులై మొగలు సామ్రాజ్యాన్ని తుత్తునకలుగా ఖండించి స్తంభింపజేసిన హిందూ మతోద్ధారకులు ఛత్రపతి శివాజీ, ఛత్రసాల మహారాజా, గురుగోవిందసింహులుగూడా దేశ దౌర్బల్యానికి మూలకందాలైన అభావాల విమర్శకాత్మకదృష్టితో పరిశోధించాడుకాడు. శివాజీ ప్రభువు దక్షిణాపథంలో

మహమ్మదీయుల రూపుమాపి మహారాష్ట్ర సామ్రాజ్యాన్ని కావేరీనదీ ప్రాంగణందాకా విస్తృతంచేసి బుజబల రక్తశీలురై అఖండ సేముషీ ధురంధరులైనారు. హిందూజాతీయ మహా వృక్షానికి అమృత సేచనం చేయించి హైందవజాతికి ఆరాధ్యత ముంపైనారు. కాని భారత ఖండంలోని రాజన్యులలో ప్రకోపించియున్న జాత్యంతర్గతవైన మనస్స్యాలవైపు దృష్టిని గుసించినారుకారు. రసపుత్రులగు మార్వాడీలను గుజరాతీయులను మహారాష్ట్రులతో సమ్మిశ్రితంజేసి సౌభ్రాతృత్వంతో మెగను నట్లు జేసినారుకారు. పాంచాలంలో అసమాన క్షాత్రం ప్రదర్శించి ప్రాణపణంతో అన్యజాతి నిరంకుశంగా కొనసాగించుచుండిన మతాంతీకరణ దౌర్జన్యాన్ని నిర్మూలించి సనాతన జాతీయాంతస్థును సముద్ధరించిన యశోమూర్తి గురుగోవిందసింహుడు భారత వీర పురుషులలో సమున్నత పదవి నధిష్ఠించగలిగినాడు. రాక్షసత్వాన్ని ప్రేరేపించిన ఆ మతానికే వేరుపురువుగా ప్రతిష్ఠనందుకున్నాడు.

ఈ మహనీయులందరున్ను భారత ధర్మసముద్ధరణకై దీక్షబూనినారే కాని అందులకు హేతుభూతములైన సంఘ దౌష్ట్యాల నరికట్టించినారుకారు. ఛాందసాచార సంస్కారం తలపెట్టినారుకారు. అపభ్రంశితులైనారు.

మహారాష్ట్రుల బుందేలీల మార్వాడీల పాంచాలుల నిరంతరపోరాటాలు ఔరంగజేబు తలపెట్టిన మ్లేచ్ఛమతాంతీ

కరణ దురంతాలను పూర్తిగా అరికట్టిగలిగాయి. అంతేకాదు మొగలు సామ్రాజ్యాన్ని కూకటివేళ్ళతో సహా కుప్పెంగదీసి వేశాయి. కాని భారతస్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలుగుటకు ఉపకరించాయికావు. ఎవరికివారే యమునాతీరే అన్నట్లు దురభిమానులైన స్వదేశ సంస్థానాధీశ్వరులు సర్వస్వాతంత్ర్యులై భోగలాలసత్వంలో హిందూదేశాన్ని ఛిన్నాభిన్నంచేసివేశారు. కేంద్రంలో దక్షతలేకుండాపోయింది. అన్యోన్య సహకార సౌమనస్యాలకు అవకాశం లోపించింది. దేశరక్షణాభారంవహించే సమర్థతే దుర్లభమైపోయింది.

౬

యూరోపియన్లశకం ప్రారంభమైనది. కూటనీతి విశారదులు మహామాయావులైన తెల్లజాతుల జిత్తులు పన్నాగాలు అచిరకాలంలోనే భారతభూభాగంలో ఫలించినాయి. బుడతగీచులకు పరాసువారలకు ఇంగ్లీషువారలకు మంచి కేంద్రస్థానాలు సులభంగా లభ్యమైనాయి. బ్రిటిషువారి ఈష్టుఇండియా కంపెనీ యూరోపువారిలో ప్రముఖస్థానం వహించింది. వ్యాపారమిషతో వారు ముఖ్యకేంద్రాలలో కోటలు నిర్మించడం ప్రారంభించారు. వ్యాపారంలోకంటె సంస్థానాధీశ్వరులలో అంతర్యుద్ధాల రెక్కొల్పి విశేష ధనం సంపాదించడం నేర్చుకున్నారు. ఈ కార్యక్రమంలో దుర్బలమైన కొన్ని సంస్థానాలు చేజిక్కడంతో రాజ్యాకాంక్ష తెల్ల

వారిలో తలచూపించింది. కోటలను పేటలను స్వయంగా నిర్మించుకోవడం సుశిక్షితులైన దేశీయసైన్యాన్ని పోషించుకోవడం తప్పనిసరియైపోయింది. విశ్వాసఘాతుకత్వం నాటి కంపెనీ పాలకుల అరచేతివిద్య. భోగవిలాసాలకు గులాములైన రాజులెందరో కంపెనీవారి సుడిగుండంలోబడి అధఃపతితులు కావడం మూలాన దేశంలోని కీలక స్థావరాలెన్నో అయాచితంగా ఆంగ్లేయులకు హస్తగతమైపోయినవి. వారి రాజ్యతృష్ణ అంతటితో పరాకాష్ఠనందుకున్నది. వ్యాపారం పేర సారాయం దిగుమతిచేశారు, భారతీయులలో యీదుర్వ్యసనం వ్యాపింపజేశారు. దేశంలో ఈ నైతిక పతనాన్ని అనుకొన్నరీతి ప్రవేశపెట్టగలిగినారు.

వృత్తివిద్యలకు పోటీసరకుల రవాణాకల్పించి భారతీయ వృత్తులపై దండయాత్రసాగించి నిరుద్యోగాన్ని లేవదీశారు. ప్రతి చిన్నవస్తువునకైనా విదేశాలపై ఆధారపడునట్లు ప్రజల్లో ఎన్నో దురభ్యాసాల సృష్టించారు. జాతినే నిర్వీర్యంచేయ సంకల్పించారు. భారతభూమి నానాచండాలంగా మారుపాటెందుతూఉండడం కండ్లారాచూస్తూ సంస్థాధీశ్వరులు ఈర్ష్యాద్వేషాలకు పాల్పడి వినాశాన్ని తమకుతామైఆహ్వానించుకున్నారేగాని భావికర్తవ్యంవైపు కన్నెత్తిన పాపానపోయారుకారు. రాజపుత్రులు భోగపరాయణులై ప్రజల బాగోగుల విషయం పూర్తిగా విస్మరించి విలాసక్రీడల్లో మునిగితేలుతూ తెల్లదొరల

దయాభిక్షకు పాత్రులై బానిసబ్రతుకున కలవడిపోయారు. ఆంగ్లేయుల సేనలు బాగా బలపడిపోయినవి.

ఆసేతుహిమాచలపర్యంతం భారతదేశంలోని రాజకీయచరిత్రాప్రసిద్ధములైన కీలకస్థానాలన్నిటిని బ్రిటిషుకంపెనీ పాలకులు తమ గుప్పిట్లో పెట్టుకోగలిగారు. కంపెనీ వ్యాపారం భారత దేశపరిపాలన క్రిందికిమారింది. తెల్లదొరల లాలూచీకి స్వార్థపరత్వంతో లోబడిన ప్రముఖ హిందువులే ఆ రాజ్యపాలనకు బాసటగా నిలువబడినారు. ఆ ఆంగ్ల మాయలోబడ్డవారు తేరుకొనుట కల్ల. తెల్లదొరల ఆకర్షణ భారతప్రాచీన సంస్కృతికే గొడ్డలి పెట్టయింది. కంపెనీ అధికారాల్లో జొరబడ్డ భారతీయుల వేషభూషణాలలోనేగాక ఆచార వ్యవహార ధోరణులలోసైతం పాశ్చాత్య నాగరికత ప్రస్ఫుటించింది. నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానాలకు తిలాంజలులిచ్చి విజాతీయ సంస్కృతీ సంపర్కంలో తల్లీనం కాజొచ్చినారు. సంఘనియమోల్లంఘనం సమయోచితం అయిపోయినది. కులీనులే ఆర్యసాంప్రదాయాల నతిక్రమించి స్వస్తి వాచకంపలుకదొడగినారు.

పదవీవ్యామోహం చేయనిదేమున్నది! ఇంగ్లీషు నీతి నియమాల ననుకరిస్తూ కొందరు ఆంగ్ల మానసపుత్రులు నల్ల దొరలుగా తయారైనారు. రొట్టె విరిగి నేతిలో బడ్డట్టు

బ్రిటీషు పాలకులకు పట్టపగ్గాలే లేకపోయినవి. భారతజాతీయ విశ్వాస ఘాతకులు. సంఘ ద్రోహులు, ఆత్మాభిమాన శూన్యులుమాత్రం కంపెనీ అధికారుల అభిమానానికి పాత్రులు గాగలిగినారు. వారేనాటి రాజకీక కార్యభారం వహించదగిన సమర్థులు, మంత్రాంగ ధురంధరులు. వారే దొరలకు దొర సానులకు ప్రీతిపాత్రులు. ఎన్నో కుతంత్రాలద్వారా మాయో పాయాల పన్నగడలద్వారా పలుకుబడిగల హైందవులు కంపెనీపాలనకు క్రీతదాసులైపోయారు. పైగా అవివాహిత లైన దొరసానులు దిగుమతికాబడ్డారు. ఈ సాలెగూడు లలో ఉద్దండులైన యువమూర్తులెందరో మానమర్యాదల గోల్పోయి పూర్ణాహుతియైనారు. పైగా దేశద్రోహానికి వెను దీయని దుర్బుద్ధి వారిలో బలకొన్నది. జాత్యంతరగత ద్వేషాలు వర్గద్వేషాలు తిన్నగా పుటమరించాయి. విభేదాలు పయి కున్నాయి. ఆంగ్లతంత్రజ్ఞుల పాచికలన్నీ ఫలించాయి. వారు పట్టినదంతా బంగారమే. వారి ఆటలు రాజ బాటలు.

౭

స్వజాత్యభిమానం ఆత్మాభిమానం ఏనాడు నశిం చాయో నాడే స్వదేశ భక్తి స్వాతంత్ర్యానురక్తి చచ్చి పోయినది. బానిసతత్వం కరుడుగట్టుకపోయినది. కంపెనీ ఉద్యోగులైన విద్యావేత్తలలో రాజభక్తి అనే తెచ్చికోలు భావం అంకితమైంది. ప్రభుభక్తిపరాయణులుగా కీర్తించబడ

డం ఒక హాబీగా విశాలాక్ష్యంగా పరిణమించింది. ఇదే సమయ కాలంలో నాటి గవర్నర్ జనరల్ బెంటింక్ ప్రభువు కిర స్తానీ మతాన్ని నిర్వహిస్తున్నారు. లా మెంబరు మెకాలే మహాశయునితో రహస్యమంతనాలు జరిపించారు. ఒక ప్రణా ళిక తయారైంది. దీనిద్వారా దేశంలోనున్న ప్రాచీన విద్యాపీఠాలను గురుకులాశ్రమాలను తుదముట్టించనిదే ఆం గ్లేయులకు దిగ్విజయం చేకూరదనే విశ్వసించినారు. ఆంగ్లభాషా ప్రచారాన్ని నిర్బంధంగా ప్రవేశపెట్టినారు. భారత రాజకీయ భాషగా ఇంగ్లీషును అంటగట్టినారు సర్కారు హుకుం జారీ అయినది. సమస్తరాజ్యాంగ కార్యక్రమాలు ఆంగ్లంలో(అర్జీలు సహా) నడవాలన్నారు. ఇంగ్లీషు పాఠశాలలు కళాశాలలు నెల కొల్పబడ్డాయి. కంపెనీకి దాసానుదాసులైయున్న భారతీయు లెగబడ్డారు. విరివిగా ఇంగ్లీషుభాషాప్రచారం సాగిపోయింది. క్రమేపి ప్రజలదృష్టి ఆకర్షింపబడింది. విద్యార్థులు విధిలేకుండా అటువైపున కీడ్వబడ్డారు. ప్రాచీన సంస్కృతీ కేంద్రాలుగా పేరుమోసిన ఆ పీఠాలు గురుకులాశ్రమాలు పోషణలేక బీడు పడిపోయినవి. చివరకు కాలగర్భంలో మాసిపోజొచ్చినయి. సంస్కృత భాషను మృత భాషగా ప్రచారం సాగించారు.

ఇంగ్లీషుభాషా బోధనలలో క్రైస్తవమత ప్రశస్తి అంతర్గతమై కీర్తింపబడడం, పదేపదే ఆప్రాశస్త్యాన్ని పఠించడం మూలాన విద్యార్థుల లేత హృదయాలలో ఆ కిరస్తానీ భావ

నలు హాస్యాస్పదం కావడం ప్రారంభమయినది. స్వజాతీయ చరిత్ర హిందూమతిసంస్కృతి మఱుగు పడజొచ్చినది.

మెకాలే మహాశయుని తపస్సు ఫలించినది. భార తీయులు ఆంగ్లేయ విద్యాభ్యాసంగలోం హద్దుమించి పోయి నారు. రాష్ట్రభాష సంస్కృతాన్నేగాక మాతృభాషల నైతిం నిరాదరణతో త్రోసి పుచ్చారు. ఒక్క ఇంగ్లీషు సాహిత్యానికొసం మినహా సర్వం విస్మరించారు. ఆభాషా ప్రలోభంతో కిరస్తానీ మత ప్రాశస్త్యం కోరకుండానే హిందు వృక్షంలో తిష్ఠవేసుకోగలిగింది. పాదిరీల కల్లిబొల్లి హామీల బురస్కరించుకొని అమాయికమైన నిమ్నజాతిప్రజ ఆనోబ్బిలో కాలూన జొచ్చింది. మతాంతీకరణం ప్రారంభం కాజొ చ్చింది. ప్రభుత్వ సహకారం ఆ ఉద్యమానికి అంతర్గత దోహదం చేకూర్చింది. మిషనరీల గౌరవం హెచ్చిపోయింది.

ఆంగ్లేయభాషాకోవిదుల వేషభూషణాల ఫక్కీ పరి పూర్తిగా కిరస్తానీల ధోరణినను గమించింది. కోట్లు బూట్లు పంట్లాములు కాలర్లు హ్యాటులు సభ్యతారంగంలో ప్రవే శించాయి. పాఠశాలల్లో న్యాయస్థానాల్లో ప్రభుత్వకార్య కలాపాల్లో ఇంగ్లీషు మినహాశరణం నాస్తి. బ్రిటిషు తొత్తు ముందు మాతృభాషామతల్లులందరు అవనతిని బొందినారు. ఆ ఆంగ్ల విద్యాభ్యాసంగంలోని మర్మమే ఇది. పదవీవ్యా

మోహాలే ఇంగ్లీషు భాషాభివృద్ధికి ప్రధాన హేతువులుగా పరిణమించాయి.

"అపహరించెన్ మన భారతీయ
  సుగుణవిద్యల్, పుచ్చిపోయెన్ గదన్
గృహశాస్త్రంబులు, వేషభాషణములున్
  పాశ్చాత్యలోకంపు పో
కడలన్ మైలపడెన్; సమస్త
  జనలక్ష్యంబర్థకామంబులై
చెడుదారిన్ బడె, బూతిగంధియగు
  నీ విశ్వాంబికా! కన్గొనన్."

'జాతీయకవి'



# ప్రథమ స్వాతంత్ర్య సమరం



కీర్తియయిచ్చుఁ బుణ్యగతి కీర్తియ తల్లియుఁబోలెఁ బ్రోచు; స
త్కీర్తియ యాయువున్ సిరియు; కీర్తివిహీనుఁడ చూ శవంబు; ము
క్కీర్తను వెల్లచేటులును గిట్టి హరించుననందె తొల్లి భ
క్తార్తిహరుండు నాబరగు నంబుజనాభు జగద్ధితంబుగన్.

'ఎఱ్ఱన'

## కారణం:

విధివిరామంలేకుండా పాదిరీలు కిరస్తానీ మతప్రచారం కంపెనీ ప్రభుత్వపు కమ్మకుతో జరిపిస్తూఉండడం, నిర్బంధ ఇంగ్లీషుభాషాభ్యాసం ప్రవేశపెట్టడం, ఆర్యధర్మాన్ని నిర్మూలించేదుకు బెంటింగు ప్రభువు కంకణం కట్టుకోవడం, భారతియుల్లో శల్యావశిష్టంగాఉన్న స్వేచ్ఛాకణాలు కించిత్తు తపించాయి. ప్రజాప్రవాహంలోనేగాక స్వదేశీ సేనల్లోపైతం ఈసమస్య వ్యతిరేకభావాలకు నాందీగామారింది. ఆవుల పందుల క్రొవ్వుజవ్వాలను తోటాలకుదాడిగే అర్డరుగూడా నిరంకుశంగా ఆంగ్లేయ సేనాధిపులచేరావడం రాజేనిప్పుల్లో ఆజ్యంపోసినట్లు మరింత తీవ్రతదాల్చింది. ఈ విముఖభావంతో కంపెనీ ప్రభుత్వందలపెట్టే ప్రతికార్యంలోను అనుమానాస్ప

దమైన లక్షణాలు భారతీయ పటాలములకు కనిపించసాగాయి. అచిర కాలంలోనే యావద్భారతావనీ కిరస్తానీమతానికి ఆహుతికాబోతున్నది, హిందూ మహమ్మదీయ మతాల కంతిమదినాలు దాపురించాయి అనే పెద్ద సంశయం సర్వత్రా వ్యాపించింది. మన శక్తి సామర్థ్యాలను మన జాతిమతధర్మక్షేమాలకు వినియోగించుకోకుండా తిన్నయింటి వాసాల లెక్కించే యీ జాతి ద్రోహులకు తెల్ల మొగాలకు ధారబోయడం పెద్ద తప్పిదమే అన్న భావం ప్రతి భారతసిపాయిహృదయకుహరంలో తలసాను లేపింది.

హిందూ మహమ్మదీయ జమేదారులు హవల్దారులు రహస్య సమాలోచనల్లో నిమగ్నులైనారు. గుసగుసలు రొసరొసలు ప్రబలిపోయినవి, ఇంగ్లీషు సార్జెంట్లు ముఖమంటేనే పటాలములోని పఠానులకు, రాజపుత్రులకు లేని శత్రుభావం దహించివేయసాగినది. ప్రతీకారభావం కన్నుల్లో నిప్పురవ్వల ప్రజ్వలింపజేసేది. కాని దురంత మరాక్రమణాలతో మత్తెక్కి ఒళ్లుమఱచియున్న కంపెని సేనానులకీ విప్లవచ్ఛాయలుస్ఫురించాయి కావు. వారి కుటిలతంత్రాలలో వారు నిమగ్నులైయున్నారు. మహారాష్ట్రులను రాజపుత్రులపైకి కవ్వించే దురుద్యోగంలో హద్దులు దాటిపోయారు. హిందూ ముస్లింలలో విభేదాల సృష్టించేందుకెన్నో పన్నుగడలను రచిస్తున్నారు. దక్షిణప్రాంతానికి మధ్యప్రాంతాలకు లేని

కార్యాన్ని సాగిస్తున్నారు, ఈ దుర్మార్గాలన్ని ఎప్పటికప్పుడే భారత సైనికులు పసికట్టేస్తున్నారు. మార్గాన్వేషణంలో తత్పరులై యున్నారు. స్వాతంత్ర్యదీక్ష కించిత్తు సాహసమూపింది.

'ఇది పరమాద్భుతంబు పరమేశనిదేశము; సహ్యపర్వతం
బిది చిగిరించె నేమొ యిపుడీగతి నెందును దేశభక్తి సా
ధ్యుదయ మతప్రసక్తి – సముచిత ధర్మపథానురక్తి; న
చ్చదశకుబోవు హైందవము సర్వము నేడిటు మేలుకొన్నదో!'

—శివభారతం.

## విప్లవసన్నాహం

మహారాష్ట్ర సింహాసనాన్ని పోగొట్టుకొని కాన్పూరులోనున్న పీష్వా నానాసాహెబుపన్నపీసు సిపాయీలలోని ఆందోళన నాకళించుకున్నాడు. భారత సంస్థానాల నొక్కొక్కటిగ లేనిపోని మిషల కల్పించి కబళించివేయుచున్న బ్రిటిషు పెనుభూతాన్ని వదలించుకొనుటకిది మంచితరుణం దక్కిందనుకున్నాడు.

నానాసాహెబు ఫిరంగీల పరిపాలనకు స్వస్తి చెప్పేందుకు గాను సాహసించి మధ్యభారత సంస్థానాధీశ్వర్లకు కబురంపించాడు. కాని ప్రప్రథమంలో ఎవ్వరూ ఆ లేఖలపై దృష్టినుంచినారు కారు. కాని పంజాబు కేసరి రంజితసింగును

కపటోపాయంతో నిర్బంధించి జైనిలో కడతేర్చి పంజాబును స్వాధీనంచేసుకోవడం - సతారారాజు స్వర్గస్థుడు కాగానే ఆ రాజ్యాన్ని ఆక్రమించివేయడం, అయోధ్యరాజ్యాన్ని కబళించడం ఏవో కుంటిసాకులు ఏకరువుపెట్టి రాజ్యాలకు రాజ్యాలనే దిగమ్రింగడం గమనించిన వెనుక చాలామంది సంస్థానాధీశులు డల్‌హౌసీ ప్రభుత్వదురాక్రమణకు వ్యతిరేకించారు. దేశస్వాతంత్ర్యరక్షణకు పాటుబడసంకల్పించారు. నానాసాహెబు అభిమతం వారిలోపడింది. తన అంతరంగికుడు అతిసాహసోపేతుడు సేనానాయకుడైన తాంతియాతోపేతో నిశ్చితాభిప్రాయం వెలిబుచ్చాడు. భారతపటాలములలోని విప్లవానలాన్ని క్రమబద్ధంచేసి సక్రమ పంథాలో నడిపిస్తే బ్రిటిషుజాతికి అంపకతాంబూలం యివ్వవచ్చునేమోనన్నాడు. ఈ గురుతర బాధ్యతను క్రమశిక్షణతో లగించి ప్రాణాలొడ్డి ముందంజవేసినట్లయితే విప్లవం జయప్రదం అయితీరుతుందన్నాడు.

తాంతియాతోపే దీక్షాకంకణం ధరించాడు. హిందూ మహమ్మదీయులనే భేదభావం విస్మరించి ప్రముఖ కేంద్రాలలోని స్వాతంత్ర్యాభిమానుల కీవార్తలందించాడు. యావద్భారతావనిలో ఒక్కుమ్మడిగా విప్లవదావానలాన్ని రగిల్చాలనే నిర్ణయానికి వచ్చినారు.

లార్డ్ పర్కాన్ల సహాకారం ఢిల్లీ నవాబుల మద్దత్తు అనేక సంస్థానాధిపతుల ఆసరా లభించడంవల్ల కావలసినంత

ఫవం ప్రాగయింది. క్రీ. శ. 1857 మార్చి మాసంలో స్వయంగా సమయసందర్భాల పర్యావలోకనం చేసుకొనే ఉద్దేశ్యంతో అజముల్లాఖానుని వెంటబెట్టుకొని విప్లవప్రధాన సేనాధిపతి నానాసాహెబు పన్నవీసు తీర్థయాత్రా మిషతో దేశాటనం విధివిరామం లేకుండా చేశాడు. అంతాపరిపక్వం కాగానే సేనలలో విప్లవాన్ని పటిష్ఠం చేసేనిమిత్త కార్యభారం తాంత్యాతోపేకు అప్పగించాడు. విప్లవ పరిచార బాధ్యత పైబూనిన తాంతియాతోపే ఉక్కుమనిషి. గుఱ్ఱపుస్వారీలో అతనికతడేసాటి. భీతియనునదెట్టిదో ఎఱుగని మేటియోధుడు. ఆర్యధర్మానురతుడు, విజాతీయ దుహంకారాన్ని సహించలేకపోబట్టే ఈమహాసారథ్యం తనపై వేసుకోగలిగినాడు. ఆ హృదయావేగమే భయంకర క్రాంతిని మహాసమర్థతతో అతినిగూఢంగా సానుకూల్యం చేయగలిగింది. వేగులవారి కన్నుగప్పి బ్రిటిష్ గులాముల చెవికెక్కనీయకుండా నవీనమార్గం అన్వేషించినాడు. అన్నీసైగలే! అరుణ కమలంమూలాన క్రాంతిబీజాల నాటినాడు. సంకేతో రొట్టెలమూలాన అందచేయబడేవి. ముక్కకుముక్క ఒక పవిత్రాదేశంగా పరిగణింపబడేది. అదొక మర్మభాష. అన్యులకు దురూహ్యం. ఆంగ్లేయులకగమ్యాగోచర మా రహస్య విప్లవ సంచాలనం,

క్రాంతి సంచాలకుడు తాంతియాతోపే దేశవ్యాప్తంగా తిరుగుబాటునకు 1857 సంవత్సరం మేనెల 31-వ

తాకీదును లగ్నం సిద్ధం చేశారు. దేశంలోని ముఖ్య కేంద్రాలలో జవాబుదారీగల సేనానాయకులే సన్నద్ధులైనారు. ఆవేశోద్రేకాలతో హిందూదేశం నాల్గుమూలలా దారుణరూపం దాల్చింది. ఆకాశపథంలో విప్లవారుణపరాగం కవిసింది. అణుక్షణం బ్రద్దలగుటకు సూచ్యాటిల్లిన అగ్నిపర్వతంలా భారత భూభాగం ప్రత్యక్షమైనది. ప్రతీకార జ్వాలల కీలావృతం ఆ వాతావరణం.

## ఝాన్సీరాజ్యం —

అదే తరుణంలో ఝాన్సీ మహారాజు గంగాధరరావు స్వర్గస్థుడైనాడు, ఆంగ్లేయుల కబంధదృష్టి ఝాన్సీరాజ్యంపైన లగ్నమైనది. దత్తత చెల్లదు. వాస్తవిక వారసుడు లేడు గనుక సంస్థానాన్ని రద్దుచేస్తున్నామన్నారు. దారుణ వైధవ్య దుఃఖసంతప్తురాలయిన రాణి, దత్తపుత్రుని ఆప్రాతో పతివియోగ వ్యథను కించిత్తు విస్మరించగలిగియుండినది కాని పిడుగువంటి యీ దుర్వార్తతో ఆయమ నిర్వీణ్ణ అయిపోయినది. పాపము ఆమె జీవితమే సంకటభూయిష్ఠమైనది.

ఝాన్సీమహారాణి అనే అమరకీర్తిని గడించిన వీరనారీమతల్లి లక్ష్మీబాయి జీవితం అతి విలక్షణం. దత్తస్వీకార నిషేధచట్టం ప్రవేశపెట్టుటద్వారా కంపెనీ గవర్నర్ జనరల్ డల్హౌసీప్రభువు ఆంగ్లేయసంపర్కంగల అనేక సంస్థానాలను

కంపెనీ పరిపాలనలోనికి కలుపుకున్నారు. అదే పద్ధతితో విలీనమైపోయిన మహారాష్ట్రంకూడా బ్రిటిషు ప్రభుత్వాధీనం అయిపోయింది. పీష్వా బాజీరావు బలవంతమైన తెల్లపటాలముల జోలికిపోకుండా పునహానగరాన్ని త్యజించి బిఠూరు పురంలో శేషజీవితాన్ని గడుప నుద్దేశించాడు. తన దత్తపుత్రుడు నానాసాహెబు పశ్వేసును వాని సోదరుడు రావు సాహెబును తన వెంట గొనిపోయినాడు. బాజీరావు సోదరుడు అప్పాసాహెబు కైతే సపరివారంగా వారణాశీ పట్టణం చేరుకున్నాడు.

అప్పాసాహెబు పరివారవర్గంలో మోరోపంతు 25రూ. వేతనంగల విశ్వాసపాత్రుడగు ఉద్యోగి. ఆ స్వల్ప వేతనంతోటే ఆయన తన కుటుంబాన్ని పోషించుకొనేవాడు. భార్య భాగీరథీదేవి గంగామతల్లివలె విశుద్ధచరిత్ర. ఆ పుణ్య దంపతుల గర్భవాసంనుండి క్రీ. శ. 1835 సం. కార్తీక కృష్ణ చతుర్దశీ (మాసశివరాత్రి) గడియల్లో ఝాన్సీమహారాణి జన్మించింది. ఆయమకు తల్లిదండ్రులు మనూబాయి అనే నామధేయముంచినారు. దినదిన ప్రవర్ధమానమౌతూ శైశవంలోనే అపురూపసుందరిలా ఆ కిశోరము మూర్తీభవించినది. ఆ బాలిక హావభావ ప్రాభవాదుల లక్షించిన ఏ లోకుడికైనా ముమ్మూర్తులా రాజరాజేశ్వరీ ప్రతిరూపమో అనునట్లు ప్రకాశించేవట. తనయ ముద్దుముచ్చటలు చవిదీరకముందే

జనయిత్రి భాగీరథీదేవి పరమపథమలంకరించినది. పాపము మనూబాయి తల్లిలేనిబిడ్డ. మాతృహీనయైన అల్లారు ముద్దు బిడ్డను ఒంటరిగా సంరక్షించుట మోరోపంతునకు గడ్డుసమస్య అయినది. ఎనలేని వాత్సల్యంతో పుత్రికారత్నాన్ని తన యెదలో దాచుకొని ఏ లోటును చెనకనీయకుండా కంటికి రెప్పవలె కాచేవాడు. అహర్నిశలు తదేకదీక్షతో ఆ బాలికను పడయూడు యీయాలునకు దెచ్చేసరికి ఇంకో ఉపద్రవం దాపురించినది. ఆశ్రయదాత అప్పాసాహెబు అకస్మాత్తుగా దివంగతుడైనాడు. మోరోపంతునకు వారణాసీపుర ఋణంగూడా తీరిపోయింది. ఆ ఉన్న ఆధారం కూడా జారిపోయింది.

జీవనోపాధి ఒకతట్టు ముక్కుపచ్చలారని పసికూన రక్షణభారం ఒకతట్టు పాపమా మోరోపంతును వేధించ సాగినవి. విశ్వాసపాత్రుడు స్వామి భక్తపరాయణుడైన మోరోపంతు దురవస్థ కర్ణాకర్ణి నాకర్ణించిన పీష్వాబాజీరావు మోరోపంతునకు ఆశ్రయదానంచేసి బిఠూరునకు పిలిపించు కున్నాడు. అవినయ సంపన్నుని శ్రమ్మికొని యుండిన తమో పటలం విచ్చిపోయింది. శాంతిమయ జీవిత వాతావరణం సమకూరింది. ఆదర్శజీవిత మారంభమైంది.

చిఱుతప్రాయంనుండి ఏ ఆడపొత్తులేక జనకుని ఒడిలో మంతిపెముఖపంటగా పెరిగిన మనూబాయి మగరాయుడుగా

వేషభూషణాల ధరించి సహజసిద్ధమైన ఆడపుట్టువులోని లక్షణాల విస్మరించినది. ఆ మనుసిగ్గు దొంతరలాయమలో మటుమాయమైనవి. జంకుగొంకులసలే లేవు. ఆకర్ణాంత విశాల నయనాంబుజాలలో సమ్మోహనదీప్తికాదు ఉజ్జ్వలక్షాత్ర తేజం ఉట్టిపడుచుండెడిది. భావిజీవితాదర్శమునకో అన్నట్లు ఆమె అభిరుచులు వీరజనోచిత శిక్షాదీక్షలవైపు పరవళ్లు త్రొక్కదొడగినవి.

కుమారికలోని వినయవిధేయతా సౌశీల్యాలేమి, ఆ నిండుముఖమండలంలో త్రుళ్లింతలీనుచున్న మహోజ్జ్వలకాంతి పుంజాలేమి తేజస్వియైన పీష్వాబాజీరావునకెంతో వాత్సల్యతను జిగురింపజేసినవి. ఆ సౌందర్య సుమరాశియగు మనూబాయిని పీష్వా మనఃపూర్వకముగా ఆత్మీయ దుహితనువోలె గారాబంతో దగ్గరకు చేరదీసినాడు. తన తనయులతోబాటు ప్రియనందిని మనూబాయికి వలసిన శిక్షాబుద్ధుల గఱపుట కేర్పాటు చేయించాడు. ఆయమ మానసిక ప్రవృత్తుల ననుసరించి తగు శిక్షణ కవకాశం కలుగజేయబడింది.

సమవయస్కులైన నానాసాహెబు పడ్నవీసు, రావుసాహెబు, మనూబాయి మువ్వురును అన్యోన్య సౌభ్రాతృత్వంతో అన్ని రంగాలలోను సమఉజ్జీలుగా అభివృద్ధినందజొచ్చినారు. గుఱ్ఱపుస్వారీ, కత్తిసాము, బల్లెపుసాధన, శస్త్రాస్త్రసంధాన కళల్లోను, విద్యాబుద్ధుల్లోను మనూబాయి

అనన్య సామాన్య వైశద్యం ఆర్జించింది. అశ్వారోహణ కళావైదుష్యంలో ఆమె అగ్రగామి. ఆ వీరకిశోరియొక్క అద్వితీయ శౌర్య ధైర్య సాహసాది సులక్షణాల దిలకించి అప్పుడప్పుడు నానాసాహెబు నిశ్చేష్టితుడయ్యేవాడట.

ఒకనాడు నానాసాహెబు రావుసాహేబులు గజారోహణోత్సవంలో పాల్గొన్నారట, మనూబాయి కా అవకాశం లభ్యంకాలేదు. ఆమె గజారోహణోత్సుకురాలై తండ్రిని అల్లాట పెట్ట సాగిందట. ఎంత ఓదార్చినను హఠం మాన లేదట. అందులకు మోరోపంతు విసుక్కొని "ఏనుగు నెక్క నంతటి అదృష్టవంతురాలవే!" అన్నాడట సులకనగా. ఆదెబ్బల కాలేత నెమ్మనం కందిపోయింది. స్వాభిమానంతో ఆ బాల "ఒకటేంటి బాబా! పది ఏనుగులెక్కనంతటి అదృష్టవంతురాలను" అని జవాబిచ్చి తండ్రి అచ్చెరువందు నట్లు చేసిందట. ఆ అభిమానం ఆ ఉద్దండ ప్రతిభ, ఆ కిశోర దశలోనే పరిణతినందజాలినవి. ఆ కుమారితలో భవిష్యజ్జీవన ప్రభాతంతోటి యవ్వనాంకురాలు పొడసూపినవి. అటువంటి అసాధారణ ప్రజ్ఞాసమన్విత మనోవికాసయగు పుత్రికామణి వివాహసమస్య తీరని ఆవేదనను రెక్కలుప మోరోపంతు పాపం చింతాక్రాంతుడై పొక్కిపోయాడు.

ఒకనాడొక జ్యోతిష్కుడు మోరోపంతు గృహాతిథ్యం స్వీకరించినాడు. అతడు మనూబాయి హస్తరేఖల వైచిత్రికి

సాముద్రికశాస్త్రములతో "మహాభాగ్యశాలిని, యీ బిడ్డకు రాజయోగమున్నది. తప్పక మహారాణి కాగలదు" అని నొక్కి వక్కాణించినారు. మోరోపంతుని కాంక్ష్యం విచిత్రంగా ఫలించింది. అయితే కల్లోలితమైయున్నట్టి ఆతని స్వాంతానికి ఆ మాటలలో కించిత్తు ఊరటమాత్రం లభించింది. దైవసంకల్పం అప్రతిహతం కదా!

మనూబాయి నవయవ్వనాంగి. అబలయే కాని మత్తె కాదు. మానిని రూపాలలామయే కావచ్చు కాని లలనావతంసం కాదా. ఆ సర్వాంగ సౌందర్యరాశి కీర్తిచంద్రికలు వ్యాపించనున్నవి. ఝాన్సీరాజ్య ప్రభువు గంగాధరరావు జ్యోతిష్కుని ప్రవచనాల నాలకించి మనూబాయిని పరిణయ మాడ నిశ్చయించుకున్నాడు. ఈ వార్త అందినవెంటనే మోరోపంతు కన్నులానందాశ్రుధారల వర్షించాయి.

వైభవోపేతముగా కల్యాణమహోత్సవం జరిగిపోయింది. మనూబాయి మహారాణి స్థాయిలో లక్ష్మీబాయిగా పేర్కొనబడింది. ఝాన్సీమహారాణి లక్ష్మీబాయి గంగాధరరావు జీవితాన్ని నందనోద్యానంగా మార్చింది. ఆ వీర నారీమతల్లి వనితామతల్లిగా రమణీలలామగా భాసిల్లింది. ఆ సమోధ జీవితప్రవంతినిలో ఒక మహాదృశ్యం వసంత మధు గీతాలాపనంతో సాంసారిక వర్తనల నర్తనంకల్పించింది.

చేసింది. దారాపుత్ర వియోగ క్లేశానలజ్వాలలతో సతమత మవుతున్న గంగాధరరావును కాలెంగ మరింత రోగాన్ని దెబ్బకొట్టింది. తన అవసాన కాలం అతిసమీపంలో ఉన్నట్లు గ్రహించి ప్రభువు గంగాధరరావు మరల బ్రిటిషు పాలకులకు వినతిపత్రాన్ని అందజేసుకున్నాడు. దత్తతను ఆమోదించ మని, ఆనందరావుకే ఝాన్సీ సింహాసనం కట్టబెట్టమని వినయపూర్వకంగా వేడుకున్నాడా విజ్ఞాపికలో.

క్రీ. శ. 1852 సం. నవంబరు నెల 21 న తారీఖున ఝాన్సీప్రజలను, మహారాణి లక్ష్మీబాయిని, దురంత దుస్సహ దుఃఖసముద్రంలో ముంచి ప్రభువు గంగాధరరావు స్వర్గస్థులైనాడు. సీమంతినీమణి లక్ష్మీబాయి అనతికాలంలోనే తన సౌభాగ్యసంపదలకు తిలాంజలు లిచ్చివేసింది. హృదయ విదారక వైధవ్యాన్ని దలదాల్చిన ఆ సాధ్వీమతల్లిలోని దివ్యానుభూతులన్నియు నిర్వాణమైపోయినవి. ఆయమ చైతన్యాన్ని గోల్పోయి జీవచ్ఛవంగా పరివర్తితమైపోయింది. రాజ్య కార్యకలాపములన్నియు అత్యంత జాగరూకతతో మోరోపంతు చక్కబెట్టుకోవలసివచ్చింది.

హఠాత్తుగా, దత్తతస్వీకరణోత్సవాన్ని సమక్షంలో చేతులారా నడిపించిన పొలిటికల్ ఏజంటు ఎల్లిసుద్వార ఝాన్సీ రాజ్య కోశాగారానికి బ్రిటిషు సీలువేశాడు. ఆంగ్లేయ సేనలను దుర్గంలోనికి ప్రవేశపెట్టి కోటపై ఆంగ్లేయ పతాకాన్ని

ఎగురవేశాడు. రాజ్యాన్ని రద్దుచేశాం. మహారాణి లక్ష్మీబా యికి బ్రతికినంతకాలం జీవనభృతిగా రు 5000 లు ఇవ్వబడు తుంది అని ప్రకటనచేశాడు, బ్రిటిషు జాతి కూటనీతిలో పరి చయంగల ఏ వ్యక్తీ యీ వార్తకు ఖిన్నుడుకాడు. పాపము మహారాణి రాజ్యాన్ని గోల్పోయినా నిశ్చింతతతో రాచ నగరు ప్రవేశించింది. బ్రిటిషు ఏజంటు గంగాధరరావు గారి సొంతసంపదలయిన ఆరు లక్షల రూపాయల విలువగల అమూల్యాభరణాలను దత్తపుత్రునికందజేశాడు. దత్త తన యునిగా అంగీకరించి పితృచరాస్తులందజేసిన యీ దుర్మా ర్గులు స్థిరాస్తియగు సంస్థానాన్ని ఏల రద్దుచేయవలసివచ్చిం దనే మనస్తాపం ఆమె కొంతసంచలనం పురికొల్పింది. కాని యిది అదనుకాదు. మించిన కార్యం శౌర్యసమ్మతం కాదు. వినమ్రభావంలో నందనుని శ్రేయస్సును మనస్సున ఉంచుకొని ఆంగ్లేయ ప్రభుత్వానికెన్నో విజ్ఞాపనలందజేసుకో జొచ్చింది. అవి అరణ్యరోదనలైపోయినవి.

మహారాణి లక్ష్మీబాయి సర్వస్వం దైవపరంచేసి హైందవ సతీరత్నాలననుసరించి పూజాపునస్కారాలతో దైవికచింతనలతో పురాణకాలక్షేపాలతో కాలం బుచ్చుకో దొడగింది. శాంతముద్రదాల్చింది. కాని దైవేచ్ఛ వేఱుకదా! భవిష్యత్తులో భయంకర మహారణాంగణంలో కాలభైరవిలా విజృంభించి శాత్రవగాత్రాలదొఱగు వేడి నెత్తుటి జొత్తుల

యథేచ్ఛగా జలకాలాడు వాడి కరవాలాన్ని, యీ పూజా ద్రవ్యాల పుష్ప పత్రదళాలతో సమార్చనంచేయు కరతలమే గ్రహించవలసియున్నదికదా! మహిషాసురమర్దనం నిమిత్తం మహా దుర్గ మూర్తి ధరించవలసినదే. అన్యులకది అనాథ్య శత్రువు.



# పోరాటం ప్రథమ ఘట్టం



దేశవ్యాప్తంగా నిశ్చితమైన గడువుకంటె ముందుగా క్రీ, శ. 1857 మే 10 వ తారీఖుననే విప్లవం ప్రబద్ధలైపోయింది. మీరటులోని స్వాతంత్ర్యపిపాసువులు బ్రిటీషు సైనికోద్యోగులొనర్చిన ఘోర దౌర్జన్య హత్యాకాండను సహించలేక కోపోద్రిక్తులై ఆ దుర్మార్గులను తుదముట్టించారు. పందికొవ్వు ఆవుకొవ్వు తూటాలకు అతికించు సందర్భంలో వ్యతిరేకించిన భారత సైనికులపై జరిగిన ఆ దురాగతాన్ని అదినుండి ఆంగ్లేయ జాతిపై పామువగ బెట్టుకొనియుండినసిపాయి మంగళ పాండే కానాడు హృదయం తగులబడిపోయింది. ఆతని ఆక్రోశం అవధుల దాటిపోయింది. శ్వేతముఖుల దురహంభావంతో గూడిన నిర్దాక్షిణ్యం తిరస్కారవైఖరి దుస్సహమైపోయింది. ప్రతీకార దవానలం ప్రజ్వరిల్లడంతోటి వీరావేశంతో తన తుపాకీని దట్టించి సింహగర్జనం చేశాడు. "సోదర సిపాయీలారా! ఊరకండి. ఆలస్యం ఎంతమాత్రం పనికిరాదు. ఈ దుర్మార్గుల దుమ్ముచేసేస్తాం. తగిన శాస్తిచేసి హైందవావనిలో నిలువ నీడలేకుండా జేసేస్తాం. తుపాకుల దట్టించండి. దొరలను కాల్చేస్తాం" అనే గంభీర కంఠారావం

పెరేడు మైదానంలో ప్రతిధ్వనించింది. భారత సిపాయీల గుండెల్లో కలియబెట్టినట్లయింది.

యోధమూర్తి మంగళపాండే పెరేడు మైదానంలో ముందంగవేసి సార్జంటుమేజరు హూసన్‌దొరపై ప్రేల్చినాడు. హూసన్ సేనాని కళేబరం మట్టిలోగూలి పొర్లాడదొడగింది. ఆ ఘోరదృశ్యాన్ని అవలోకిస్తూఉండిన బ్రిటిష్ లెఫ్టినెంటు బాగ్‌దొర కన్నుల నిప్పులురాల రివాల్వర్ పైకెత్తి తన అశ్వాన్ని ఉద్రేకంతో ముందుకురుకించాడు. ఉత్తర క్షణం లోనే బాగ్‌దొర శవం కుప్పయి పెరేడుమైదానంలో దూళిలో గలిసిపోయింది. సేనావారంలో కలబలం చెలరేగింది. తెల్ల వాళ్లు భగ్గున మండిపోయినారు. మంగళపాండే ప్రక్కనున్న బ్రిటిష్ సైనికుడు ప్రక్కవాటున పాండే కుత్తుక నుత్తరించ దీర్ఘకరవాలం చివాలున లాగినాడు. కాని మరుక్షణంలోనే ఆ తెల్లవాని శిరస్సు మొండెంనుండి ఎగిరిపోయింది,

కర్నల్ వీలర్‌దొర మేఘగర్జనంతో రెజిమెంటు నుద్దేశించి "ఆ ద్రోహిని బంధించండి." అని ఆజ్ఞాపించాడు. కాని ఆ పెరేడు మైదానంలో భారత సిపాయీలేకాదు తెల్ల వాళ్లు సైతం ఆ అర్జునుని ఖాతరుచేయలేకపోయారు. సైని కులు తన ఆజ్ఞను ప్రతిఘటించడంతోటి వీలరు సేనానికి చలు వలు గ్రమ్మినాయి. తన గుఱ్ఱండెక్కలకు బుద్ధిచెప్పి శిబిరానికి

పారిపోయినారు. ఈ ప్రతీకార చర్యల నణచివేయుటకు బ్రిటీషు సేనానులు పైకొనునంతలో ఎదురుదాడులు చెలరేగి పోయినవి. భారత సేనలు క్రమబద్ధంగా పోరాటాలు సాగించదొడగినవి. అనతికి తరవైరోజులకు ముందుగానే చెలరేగిన విప్లవ ఝంఝామారుతం ఏలాగో త్వరితగతి పాకిపోయింది. వారాలలో ప్రారంభమైన ఢిల్లీ, లక్నో, కాన్పూరు, కాశీ, అలహాబాద్, ఆగ్రా, అయోధ్య, అలీఘర్, పాట్నా, ఝాన్సీ, నసీరాబాద్, ధనాపూర్, బరేలీ, ఫిరోజ్‌పూరు, షహాజహాన్‌పూరు మొదలైన ప్రాంతాల్లోని పటాలాలు తిరుగుబాటుచేసినవి. యుద్ధజ్వాలలు వెల్లుబికిపోయినవి. తెల్లసిపాయీలవధ నిరాటంకంగా సాగిపోజొచ్చింది. ఢిల్లీలో మొగలు పాదుషా బహదూర్ షా స్వయంగా సేనానాయకత్వం చేపట్టినాడు. ఆ విప్లవ సంగ్రామ కోలాహలం తెల్లజాతికి భీతావహంగా పరిణమించింది.

కాన్పూరులో జూన్ 4-వ తారీఖున సిపాయీల తిరుగుబాటు ప్రళయంకరంగా చెలరేగింది. నానాసాహెబు పట్నవీసు స్థావరం అది. భారత పటాలాలన్నీ పరిపూర్ణంగా స్వతంత్రసేనలుగా మారినవి. కాన్పూరులో బ్రిటీషు రెజిమెంటు అధినేత జనరల్ వీలరు సేనాని విప్లవసేనలకు దాసోహమ్మన్నాడు. భారతీయ క్రాంతి నాయకులు దయార్ద్రహృదయులయి నిరాయుధులై గంగానదినిదాటి పారిపోండని

తెల్లపటాలానికి అనుమతినిచ్చారు. నిరాయుధులయి బ్రిటిష్ సోల్జర్లందరు తమ కుటుంబాలతో గంగానదిలో పడవలపై దాటబోతున్నారు.

ఇంతలో పిడుగువంటి వార్త నాగపూరు స్వాతంత్ర్య సేనలకందినది. కాశీలో జనరల్ నీలుసేనాని క్రాంతిదళాల నిర్దయంగా చిత్రవధ చేశాడని, దాదాపు 5000 మంది విప్లవ సిపాయీలకాలం నాశనమైనదని క్రూరాతిక్రూరుడై నీలు కిరాతకుడు తిరుగుబాటుదార్లకు మద్దతిచ్చారనే అనుమానంతో ఉన్నత కుటుంబీకుల మానమర్యాదలను కూడా గణించుటలేదనియు వారణాసీనగరం పీనుగుపెంటలతో పచ్చినెత్తురు ప్రవాహాలతో కళంకితమై పోవుచున్నదని నగరం నీలు సేనాని కార్పణ్యంతో నిర్మానుష్యం అయిపోయిందని తెలియ వచ్చింది.

ఆ యుదంతం చెప్పబడగానే కాన్పూరులోని విప్లవ సైన్యాలు ఉద్రేకోన్మాదంతో బీభత్సమూర్తులై పోయారు. గంగానది దాటుతున్న తెల్లజాతి సిపాయీలపై విరుచుక పడ్డారు. ఇక చెప్పవలసిందేమున్నది ప్రతీకార తృష్ణపిపాసతో మానవత్వాన్ని కోల్పోయియున్న హైందవ సైనికులు విచ్చలవిడిగా మారణహోమం జరిపించారు. గంగామతల్లి అంతఃకరణం పీనుగులతో వికలాంగములతో రుధిర కాంతులతో

అమంగళకరంగా ప్రత్యక్షమైంది. అది ఘోరకృత్యమే. భారతజాతి గర్హించదగినదే!

ఉన్నట్టుండి ఝాన్సీ కోటలోని భారత సిపాయీలు హవల్దారు గురుబక్సింగు నాయకత్వాన ఎదుర్కొన్నారు. వెంటనే కోటలోని ధనాగారాన్ని ఆయుధాగారాన్ని ఆక్రమించుకొన్నారు. ఆ కోటలో ఆధిపత్యం వహించియుండిన బ్రిటిషు సేనానాయకులు కెప్టన్ డన్లప్ దొర, టైలర్ దొరలు నిలువునా తుపాకిగుండ్లతో ప్రేల్చివేయబడ్డారు. అచ్చటనే తలదాచుకొనియుండిన ఆంగ్లేయోద్యోగులు, సోల్జర్లు నిర్దాక్షిణ్యంగా చిత్రవధలపాలయ్యారు. రెచ్చిపోయిన పఠాన్ సిపాయీల ఆగ్రహానికి గురియై బిడ్డలు పాపలు స్త్రీలతోసహా తెల్లజాతివారు హత్యగావించబడ్డారు.

వానప్రస్థాశ్రమంలో తల్లీనయై ధర్మచింతనాయత్తచిత్తయైయున్న మహారాణి కోటలోని ఆంగ్లేయుల దురవస్థకు దురపిల్లినది. తానెంతమాత్రం ఆ ఘోరకర్మను హర్షించిందికాదు. విప్లవయోధయూథాన్ని శ్లాఘించదలపెట్టలేదు. ఉదాసీనముద్ర వహించింది.

ఈ వార్త లందటంతోటే ఆంగ్లేయ పటాలాలు పెద్ద యెత్తున ఝాన్సీ రాజధానిపై దాడిచేసినవి. నిరపరాధులైన ఝాన్సీ నగరవాసులపై దౌర్జన్యం కిరాతకత్వం ప్రతీకార

## పోరుకలనిలో - వీరమాత



"హతో వా ప్రాప్స్యసి స్వర్గం

జిత్వా వా భోక్ష్యసే మహీం"

—భగవద్గీత.

వీరుల తీవ్ర ప్రతాపాగ్నికి సెగతట్టి ఆ తెల్లబలాలు తిరుగుముఖం పెట్టినాయి. ఆయా ప్రాంతాల్లో విప్లవ సమరాన్ని చేపట్టి నాయకత్వంవహించిన మహావీరుల అనన్యసామాన్య సంకులసమరం ఆంగ్లేయుల గుండెల్లో బండ్లలాగించాయి.

ఉత్తర భారతంలో విప్లవం ప్రళయస్వరూపం దాల్చింది. స్వాతంత్ర్య సంగ్రామ మహాసేనాని నానాసహేబు నెదుర్కొన్న ఇంగ్లీషు సేనాసమూహాలు మారణహోమానికి ఆహుతికావించబడ్డాయి. ఢిల్లీ మొగలాయి బాదుషా బహదూర్ షా ప్రదర్శించిన అత్యంతాద్భుత సాహసాలు తెల్లమొగాలలోని జీవకళలను హరించగలిగాయి. మొగల్ సామ్రాజ్య బేగం జీనత్ మహల్ కదనరంగంలో వీరవిహారం సల్పి అసమానగౌరవం సముపార్జించినది. మహిళాలోకానికే వన్నెకూర్చింది. శూరశిఖామణి అజముల్లాఖానుని మొక్కవోని శస్త్రం లక్ష్యం తప్పనిగుండె బ్రిటిషు సేనానుల హృదయాలలో మృత్యుభీతి రగిల్చింది. మౌల్వీ అహమ్మదుషా హిందూ ముస్లిం సమైక్యత కేతుగడగా తన రాజనీతి చాతుర్యంతో అశక్తులలోసైతం అనంత సాహసాన్ని ఉద్దీపింపజేసి పోరాటాన్ని ముమ్మరం జేయగలిగినాడు. అమరసింహుడు సార్థకనామధేయుడై సమరసింహుడుగా తన శౌర్యాన్ని కెందరినో ఆంగ్లేయయోధుల బలిపెట్టి బ్రిటిషు పటాలాలను పటాపంచలుచేశాడు. తన ధాటిని నిల్వరించగల దొమ్మలు లేకుండా అసమానుడై విజృంభించాడు. అది మానవాతీత సంగ్రామ వైదుష్యం కురుక్షేత్ర క్షాత్రలీల.

అసమాన ప్రియనీతివర్తనము ప్రాణాంతంబునందుఁ మలీ
మసమగ్రాహ్య మసుప్తయాచన మసంప్రార్థనాభావముల్
వ్యసనావాప్తిని ధైర్యముఁ బుధజనాత్యంతానుకూలత్వ మీ
యసిధారావ్రతచర్య యెవ్వడు మహార్యశ్రేణికిఁ జెప్పెనో!

—భర్తృహరి

# జగదీశపురం

బీహారురాష్ట్రంలో జగదీశపురం ఒక చిన్నసంస్థానం. సంస్థానాధీశ్వరుడు శతవృద్ధు రాణా కుమారసింహుడు. ఎనుబది వత్సరాలుగల వీరపురుషుని జీవిత మద్భుతగాథ. దేశభక్తి, ప్రజానురక్తి, ఆత్మశక్తి, అకుంఠిత సేవాసక్తి, రణరంగ వీరవిహారశక్తి అద్వితీయం అనుపమానం. వారి విశ్రుతఖ్యాతి. ధైర్య సామర్థ్యాలతో గూడిన అమూల్య దేశభక్తికి మెచ్చి ఢిల్లీపాదుషా 'రాణా' బిరుదు ప్రదానంతో ఆ రసపుత్రయోధుని సత్కరించాడు. స్వాతంత్ర్యమే జీవిత పరమావధిగా మసలు రాణాకు బ్రిటిషు రాజరికం ప్రమాద భూయిష్ఠంగా వార్ధక్యంలో తీరని ఆవేదన కూర్చదొడగింది.

డల్‌హౌసీప్రభుని కుటిల తంత్రాంగంద్వారా భారతావనిలోని సామంతరాజ్యాల వనేకాన్ని రూపుమాపడం బ్రిటిషు దురాక్రమణ యథేచ్ఛగా సాగిపోవడం రాణా పసిగట్టివేశాడు. అచిర కాలంలోనే పరాధీనత ప్రాముఖ్యంబోతున్నదనే భీతి అంకురించింది. పారతంత్ర్యానికి మూలకందాలైన

శాసనాల నాకళించుకున్నాడు. కాని కార్యసాధనాతంత్ర పరిజ్ఞాన దక్షుడైన కాను తగిన తరుణాన్ని నిరీక్షించ దొడగినాడు. లార్డు బెంటింగు హయాంలో తెల్లవారల దుందుడుకుతనం హద్దుమీరిపోయింది. రాజ్య దురాక్రమణాకాంక్ష అవధుల దాటడంతో భారత వసుంధరలో విప్లవం చెలరేగింది. అవార్తలందినవో లేదో వృద్ధాప్యంతో కలక బారియుండిన ఆ నెత్తురుగూడా క్రాగిపోయింది. కెప్టెన్ టయిలర్ సేనాని రాణా కుమరసింహుని అంతర్యాన్ని అవగాహనం చేసుకున్నాడు. దీర్ఘపోరాటాలతో కరుడుగట్టియున్న ఆ వృద్ధ కేసరిని స్నేహమార్గంలో బంధీకృతుని జేయడం శ్రేయస్కరమనే సంకల్పంతో మాయోపాయాన్ని రచించాడు. పాట్నానగరంనుండి ఆదరాభిమానాలుట్టిపడునట్లు "వయోవృద్ధులైన తమరు ఇంచుక సడలిన దేహారోగ్యంతో రాజ్యపరిపాలనా భారం వహించడం వలన అశాంత చిత్తులైయున్నారు. ఈ మండువేసవిలో కొద్దికాలం నాసాన్నిధ్యంలో ఆతిథ్యమందుకొనుచు విశ్రాంతి చేకొన ప్రార్థిస్తున్నా" నను విషపూరిత మధుర వాక్యాలనుల్లేఖించి లేఖనంపించినాడు.

మహారాణా కుమరసింహుడు అసాధారణ రాజనీతి కోవిదుడు. కుటిల కుట్రల పన్నుగడల మూలకంచా ఎరిగిన మేధానిధి. టయిలర్ ద్వార హృదయాభిమతాన్ని గ్రహించి

ప్రతిక్రియ చేయ నెంచినాడు. కుట్రకు ప్రతికుట్రగా ప్రత్యుత్తర పత్రిక సవినయంగా అందజేసుకున్నాడు. పాపం టయిలర్ దొర ఎత్తులు పారినయి కావు. అతని యుక్తిని తలదన్నినట్లు జరిగినది.

నాడే మహారాణా కుమరసింహుడు బ్రిషుజాతినే భారత ధరిత్రినుండి నిశ్శేషంగా తరిమివేయగలిగిననాడే భారతీయులు స్వాతంత్ర్యలక్ష్మిని లక్షించగలుగు సుముహూర్తం లభ్యమవుతుంది. అని నొక్కి చెప్పివేశాడు. అనుభవ పూర్వకంగా పలికిన కుమరసింహుని నిర్వచనం—యిటీవల భారతజాతిపిత మహాత్మాగాంధీ 'క్విట్ ఇండియా' (తొలగిపొండి) అనే ఉద్యమాన్ని లేవదీసి సఫలీకృత మనోరథుడైన తదుపరి ఋజువు కావించబడింది. మహాపురుషుల భవిష్యద్వాణి వృథాకాదు.

టయులర్ సేనాని దేశంలో విప్లవదుమారం విలయతాండవంతో బహుళ స్వరూపం దాల్చడం గమనించి ఈరసపుత్ర వృద్ధసింహం, ఆ ప్రళయంకర మహాయజ్ఞగుండంలో తప్పక భాగస్వామి కాగలడనే దీర్ఘ సంకోశంతో అతి జాగరూకత వహించి వేగన్నులపొంచియున్నాడు, రాణా గడి జేరిన మేటిజోదు. అనవసరంగా బ్రిటిషుశాసకులు తన స్థానం విషయంలో జోక్యం గలిగించుకోవడం మహారాణాకు అత్యంత లజ్జాకరంగాను బాధాకరంగాను తోచినది. ఆర్య

భూమిలో బ్రిటిషుజాతి నిరంకుశంగా దురాక్రమణాల జరుపగల గడం క్షత్రియ తేజం కంటుపోయిగదా అని వాపోయినారు. ప్రతీకార దవానలం వారిలో భగ భగ మండిపోయినది. శ్వేతజాతి దురహంకారానికి బుద్ధి చెప్పవలెననే ముష్కర యోచనల్లో ప్రాముఖ్యంగ్రాగిపోయింది.

తనది చిన్న సేనయే కావచ్చు కాని ఆ సిపాయీల లోని ప్రభుభక్తి జన్మభూమికై ప్రాణాలర్పించగల అతి సాహసం నిజంగా అనన్యసామాన్యం. వారిలో ఒక్కొక్కరే ఒక్క దళానికి దీటుకాదగిన శౌర్యప్రతాపోజ్వల త్యాగ మూర్తులు. సేనిక సహించి ఊరుకొనుట అప్రస్తుతం స్వాతంత్ర్యధ్వజారోహణం జరపాలి. ఈ మహోద్యమంలో సతమతమౌతున్నాడు.

ఇంతలో 'దా నా పూ రు' పల్టన్‌లలోని మూడు భారత పటాలములు విప్లవ సందేశాన్ననుసరించి మాతృ దేశ విముక్తికై తిరుగుబాటు చేసినవి, సర్వ స్వాతంత్ర్యంతో అవి విచ్చలవిడిగా జగదీశపురం సమీపించినవి, మహారాణా కా వర్తమాన మందినది. మహారాణా ఆ విప్లవ సిపాయీ రెజిమెంట్లను గౌరవ పురస్సరంగా సమాదరించి దేశభక్తి భరితమైన ఆ హృదయాల సంతృప్తిపరిచాడు. ఆ పటాల ముల నాయకుల కోరికపై రాణా నాయకత్వం వహించాడు. తన చిరకాల వాంఛితం నేడు అయాచితంగా దైవనియో

గంలో ఒనగూడనంతో ఆ రసపుత్ర వృద్ధపంచాననం దిక్కు-లు ప్రతిధ్వనించేట్టు సింహగర్జనంచేశాడు.

అదే సుముహూర్తంగా జగదీశపుర సంస్థానాధిపతి విప్లవసేనల సర్వ సైన్యాధిపత్యం మొదలవహించి బ్రిటిషు పటాలాలపైకి కవిశాడు. తొలితాకిడిగా షాహాబాదుజిల్లా ముఖ్యపట్టణం 'ఆరా' కోటపై ముట్టడించాడు. కోటలోని శొక్కు పటాలాన్ని విప్లవ సేనలలో చేరవలసిందిగా ఆహ్వానించినాడు. ఆశలు జూపెట్టినాడు. కాని ఆ ప్రబుద్ధులు ఆంగ్లేయుల మాయలోదగుల్కొని తిరస్కరించారు. అప్పుడు విధిలేక భారత పటాలంపైనగూడా దాడి జరుపవలసి వచ్చింది. మహారాణా విప్లవం వార్తలందగానే కెప్టెన్ డన్బరుసేనాని పెద్ద సేనతోవచ్చి ఆరాచేరుకున్నాడు. విప్లవ సేనాసమూహంపైకి ఎత్తివచ్చుచున్న డన్బరు సేనాని వర్తమానం అందినవెంటనే కుమరసింహ సేనాని విప్లవసేనలలోని పెద్దలతో వితర్కించాడు. యుద్ధవ్యూహ రచనలలో ముక్కాకలుదీరిన ఆ వృద్ధవీరుని హృదంతరంలో హైందవ ధర్మజ్యోతి ఛత్రపతి శివాజిమహారాజ్ ప్రత్యక్షమైనాడు. గెరిల్లారణనీతి రాణామేధస్సులో ప్రతిఫలించింది. యోధులకు వచ్చుబలికి ముట్టడి తీరుల మార్పుచేశాడు. గెరిల్లావిధానాన్ని అయుక్తపరిచాడు.

దురహంకారమూర్తి కెప్టన్ డన్బరుసేనాని ఆ దుర్గాన్ని సమీపించునప్పటి కచ్చట స్వాతంత్ర్యసేనల పత్తా కనిపించిందికాదు. తిరుగుబాటుదారులు పిరికిబారి పారిపోయారనే ధీమాతో పరాకుతో, అపహాస్యాలతో తూలనాడినాడు. ఇంతలో సూర్యాస్తమయం కావడం మెలమెల్లగా నలుముఖాలు అంధకార బంధురంకావడంతో హఠాత్తుగా తుపాకి గుండ్లవర్షం డన్బరుసేనాని రెజిమెంటుపై ప్రారంభమైంది. ఏమఱుపాటులోనున్న ఆంగ్లేయ సైనికులు కారుచీకటిలో చెల్లాచెదరైనారు వందలాది సోల్జర్లు తుపాకిగుండ్లకు బలియై యమసదనానికి అతిథులైనారు, ఆ కారుచీకటి తెరలలో విభ్రాంతులైన బ్రిటిషు పటాలంలోని సిపాయీలు ఒండొరులపై తుపాకుల ప్రేల్చుకోజొచ్చినారు. కోటనానుకొనియున్న మహావృక్షాల కొమ్మలపైనుండి తుపాకిగుండ్లవర్షం కురిపించుచున్న రాణా గోరిల్లాదళాలుమాత్రం చెక్కుచెదరినాయి కావు. ఎక్కడివారక్కడబడి రెజిమెంటు పూర్ణాహుతి అయిపోయింది. దురభిమానపూరితుడైన డన్బరు సేనానికూడా ఆ ఘోరకలని కెఱిగినాడు. తూరుపు తెల్లవారునప్పటికి రాణా సైనికులు 'ఆరాదుర్గాన్ని' కైవశం చేసుకోగలిగినారు.

ఆదుర్గ రక్షణలో ఆంగ్లేయ పటాలం తుడిచివేయబడ్డదనే దుర్వార్త నాల్గువైపులా పాక్కిపోయింది. మేజరు అయ్యర్ కమాండర్ తోకతొక్కిన త్రాచులా క్రొత్త

రెజిమెంట్లు వెంటబెట్టుకొని భయంకర దాడి తైనాతీచేశారు. మహారాణా ఆ సేనలరాక వీక్షించిన వెంటనే ఎదురుముట్టడి చేశాడు. ఉభయ సేనావాహినులు తలపడినాయి. ఇరువాగుల వీరనిశ్చయానికి తమ సంగ్రామ నైపుణ్యాన్ని తీవ్రతరం చేయడానికి అదనుచిక్కింది ముఖాముఖీ ద్వంద్వయుద్ధం చెలరేగిపోయింది. కురువృద్ధునిపోల్కి కుమరసింహు డత్యుదగ్రమూర్తియై పగతుర ఆర్తనాదాలమధ్య దీర్ఘనిద్ర జెందునట్లు స్వైరవిహారంతో నురుమాడజొచ్చినాడు. ప్రతి స్వాతంత్ర్య సిపాయి హరిణాలొద్దె చావోబ్రతుకో తేల్చుకొను తమకంతో విజృంభించి పోరులోని సారు రుచిచూపించుతున్నాడు. మృత్యువే మేల్కొన్నట్లు అయ్యారుసేనాని గుండె లావళించాయి. అతడి ఆయువు గట్టిదైనందుననేమో ఇంతలో మరతుపాకుల బ్రిటిష్ రెజిమెంటొకటి అయ్యారు సేనానికి బాసటగా తోడ్పడింది.

ఆంగ్ల సేనా వాహినులనంతంగా వృద్ధికావడం గమనించిన సేనాని కుమరసింహ వృథాగా విప్లవసేనలు వెనగులాడి అసువుల ధారపోయడం పనికిమాలినసేతగా పేర్కొన్నాడు. అరాముట్టడినుండి విరమించుకొని జన్మభూమిం జగదీశపురంవైపు పయనించాడు.

మహారాణా కుమరసింహునిపై పగదీర్చుకొనే శక్తితో ఒక్కుమ్మడిగా ఫరంగీ సేనానాయకులు అసంఖ్యాకమైన రెజి

మొంట్లతో జగదీశపురంపైకి దండెత్తినారు. శత్రుమూకల తాకిడి కొంతమాత్రం కలతపడకుండా వీరధాటిగా ఎదుర్కొన్నాడు. పోరుఘోరమై బీభత్స ఆర్తనాదాలతో గుండ్ల ప్రేలుళ్ల భయదారావాలతో పట్టపగలు కారుపొగల కటిక చీకట్లలో అఖండన క్షోణి ప్రచండరూపందాల్చింది. వయోవృద్ధుడైన మహారాణా శత్రు భయంకర కాళమూర్తియై అన్నిరంగాలలో తానై విజృంభించి తెల్లమొగాల కుత్తుకలుత్తరించుకొంటూ పోయాడు. క్రాంతియోధు లకేయులై విజయ నినాదాలంబర పథాన ప్రతిధ్వనులీన 'గోరోంకోమారో' అంటూ కదనోన్మాదంతో ఉన్మనులయిపోయారు. త్యాగలక్ష్మి కానాడు జగదీశపురాంగణంలో మహోత్సవం జరిగిందన్నమాట. స్వాతంత్ర్య పటాలములు పరిమితములే. కాని బ్రిటిషుసేనలు నాల్గుదిక్కులనుండి పిక్కటిల్లుచుండినవి. ఎంతకాలం పోరాటం!

పోరు కలనిలో నిజాయితీపరులై ప్రాణాలర్పించుటకంటే ఈవిషమతరుణంలో ప్రాణాల రక్షించుకొని స్వాతంత్ర్య సంగ్రామ జ్వాలల కండగా నిలువబడడం దేశానికత్యవసరం కదా అనే అంతిమ సిద్ధాంతానికి బద్ధుడై రాణా కుమార సింహుడు క్రీ. శ. 1857 అగష్టు 14 తారీఖున జన్మస్థానాన్ని శత్రుపరంజేసి మరలినాడు.

శేషించిన వీరయోధులతో సమీపారణ్యాల్లో కేంద్రం సృష్టించుకున్నాడు. తెల్లపటాలాలపై గొరిల్లా యుద్ధదాడుల

ప్రారంభించాడు. ఆంగ్లేయజాతిని పదిపది కుత్తుకలు త్తరించడం వారి ఆహారపదార్థాల కొళ్ళగొట్టడం తదేకదీక్షతో సాగించాడు. బ్రిటిషువారికి సింహాస్వప్నంగా పరిణమించాడు. వారి నిద్రాళ అసాధ్యసమస్యగా వేధించింది. ఆ దుర్గమారణ్యాల్లోని మార్గాలు అపరిచితుల కగమ్యగోచరం. వారిని వెన్నాడిన బ్రిటిషు సోల్జరులు ఆ భీకరాడవుల్లో చెట్టుకొకరు పుట్టకొకరుగా ఆకలిదప్పులతో మాడిచచ్చారు. ఆ ఉద్రిక్త వృద్ధకేసరిని దుదముట్టించు ప్రయత్నంలో నాడు తెల్లదొరలు పూర్తిగా విఫలులైపోయారు. విశేష నష్టాన్ని పొందినారే కాని కుమరసింగుని దండయాత్ర లరికట్టలేకపోయారు.

జగదీశపురాన్ని చేజిక్కించుకున్న కంపెనీ పాలకుల ప్రక్కలో బల్లెంగా మరల మహారాణా తయారైనాడు. సమీపారణ్యంలో చాలాకాలంనుండి పాడువడి దుర్గమంగా ఉన్న "అతవేరియా" దుర్గాన్ని ఆవాసయోగ్యంగా మరమ్మతు చేసుకుని కుమరసింహుడు స్వాతంత్ర్య యోధయూధంతో గొరిల్లా చాటుపోటుల తీవ్రతరం చేశాడు. తన లక్ష్యసాధనకై భగీరథ ప్రయత్నం తలపెట్టి పూర్తిగా రాత్రించరుడైనాడు. ఆ కఠోరాంతఃకరణంలో కరుణకాస్కారంలోపించింది. ఆ పరమారణాకృతికి తెల్లసిపాయిల ఎదలు కంపించిపోయేవట. దర్శన మాత్రంతోనే చలువలుగ్రమ్మి చచ్చేవారట.

ఇంగ్లీషు రెజిమెంటుల కలని యునికి మహా ప్రమాద కరంగా పరిణమిల్లడంతో అతవేరియా దుర్గంపై అతివ్యయ ప్రయాసలతో దాడి ప్రారంభించారు. కాని మహారాణా పేరంటేనే దద్దరిల్లే ఆ పటాలాలేమి చేయగలుగుతాయి, కుమరసింహుని సింహగర్జనలు చెవులబడినంతనే ఎక్కడి సిపాయిలక్కడ దూదిపింజాలైపోయారు. పిక్కబలంచూపే ఆపాటుబోతుల వెన్నంటి స్వాతంత్ర్య సేనావాహినులు 'అజంగడ్' వరకు తరిమి తరిమి చిత్రవధల పాల్జేశారట అజంగడ్‌లో ప్రాణాలు దాచుకున్న తెల్లసిపాయిల నుఱు మాడేందుకు అక్కడి కోటను చుట్టుముట్టినారు విప్లవ సేన లత్యంత నైపుణ్యంతో దలపడ్డాయి. అజంగడు దుర్గం లెఖ లోనిది కావడం మూలాన ఎక్కువకాలం పోరాడవలసి వచ్చింది. ఇంతలో కంపెనీ అశ్వికబలాలు గడరక్షణకు విశేషంగా రప్పించబడ్డాయి. కదనరంగంలో మార్పుదయిం చడం పసికట్టిన మహారాణా భవిష్యత్తును మనస్సులో దల పోసి అనవసరకయ్యానికిది అదను కాదనుకొని తక్షణం దాడి విరమించుకున్నాడు. మరల విప్లవసేనలు అతవేరియా చేర డమా అన్యమార్గం త్రొక్కడమా అనే సమస్య ఉదయించింది.

రాణాకుమరసింహుడు తోటి సేనాధిపులతో తర్కిం చాడు. తన మనోభీష్టం ఎరుక పరిచాడు. కాశీ క్షేత్రంలో

కేంద్రం సృష్టించుకొని కలకత్తాలోని బ్రిటిషు సేనలకు అలహా బాదులోని రెజిమెంట్లకు గల అవినాభావసంబంధాన్ని విచ్ఛేదం చేయగలిగితే అక్కడ ఉభయపటాలాలు దెబ్బ తింటాయి. అన్యోన్య సహకార సంబంధాల గోల్పోయిన ఆ దళాలను తిరుగుబాటు సేనలు సులభసాధ్యంగా ఎదుర్కొన గలుగుతాయి. ఈ సదవకాశాన్ని మనం జారవిడువరాదు. అనే యూథివమ్మకంతో హుటాహుటిని విప్లవసేనలు కాశీ నగరంవైపు తరలించబడ్డాయి.

ఆ వ్యూహ మమోఘమైనది. కాని దైవగతి ప్రతి కూలించినది. ఈ రహస్యం బట్టబయలైనది. వారణాసీ నగరంవైపు తరలిన విప్లవదళం ప్రగతి నెమరించవలసిన విశ్వ ప్రయత్నాల్లో బ్రిటిషు సేనానులు మేజర్లు కెప్టన్లు కేంద్రీక రింపబడ్డారు. భారీయెత్తున ఆరితేరిన ఘటికులతో చతు ర్ముఖ వ్యూహాలు పన్నబడ్డాయి.

తనగుట్టు రట్టుకావడం బ్రిటిషువారి ఉద్ధృతి మిడితేల డం ఆ చూకీ తీసిన రాణా ఆలోచనయావస్థలో మునిగి పోయాడు! తన ఆలోచనలన్ని బుగ్గిపాల్గావడం సమకట్టిన యత్నం విఫలంకావడంతో మనస్సు చీకాకెత్తింది. కాని రాణా యమకుండెగల ధీరోదాత్తుడు. నిరాశకెడమిచ్చు నంతటి తేలికాడు. బ్రిటిషువారి వాలకంలోని లోతుపాతుల

మనుగడ తెరింగిన తాను తన జన్మభూమిని చేరుకోవడం నాటి కర్తవ్యంగా మదించినాడు. తన నెట్లయినా తుదముట్టించే దారుణ ప్రయత్నంలో ఎత్తివస్తున్న సేనాధిపతుల కండ్లలో దుమ్ముజల్లి 'గాజీపూరు సమీపంలో గంగానదిని దాటి పోయేందుకు ఏర్పాట్లు కావించుకున్నాడు. జగదీశపురాన్ని స్వాధీనచేసుకొని తర్వాత విప్లవసేనల లక్ష్యాన్ని నిర్ణయించ దలచుకున్నాడు. మహాసాహసంతో ఆ కత్తెరవ్యూహం నుండి చెక్కుచెదరకుండా విప్లవసేనల వెంటబెట్టుకొని దారి సాగించాడు.

దేశం ఆసాంతం చెలరేగిపోయిన విప్లవ దుమారం దుర్దమం. అప్పుడిప్పుడే వేళ్లుపాతుకొనుచున్న ఆంగ్లేయులకిది గొంతుకోతగా పరిణమించింది. వారిలోవారు గుజగుజలాడి పోయారు, ఒండొరుల నిందించుకోవడంకూడా జరిగిపోయిందట. ఇంగ్లాండులోని ప్రభుత్వం కొంచెం విమర్శకదృష్టి బరపింది. ఆంగ్లేయసేనానులు ఎక్కడివారక్కడ విప్లవశక్తుల నెదుర్కొనవలసివచ్చింది. అనేకమంది సేనానులు విప్లవ దావాగ్ని కీలలలో మసియై పోయారు.

కుమరసింగు తన వీరయోధులతో మరల జగదీశపురం ఆక్రమించేందుకు ప్రయాణమైనాడు. నడికినడిరేయి గుప్త మార్గాన గంగానదిని సమీపించి అవలికి పడవలద్వారా పయనిస్తున్నాడు. ఎవడో దేశద్రోహి యీవిషయం బ్రిటిషు

అధికారుల కందకేశారు. హఠాత్తుగా తెల్లసిపాయీలు నదీగర్భంలో ప్రయాణంచేసే పడవలపై తుపాకులతో ఫిరంగులతో ముట్టడించారు. వృద్ధవీరుడు కుమరసింగు మణిబంధంపై తుపాకి గుండు దెబ్బతగిలింది. ఆభాగం నుగ్గయిపోయింది.

వీరకేసరి రాణా కుమారసింహుడు ఈషణ్మాత్రమైనా అధైర్యపడలేదు. గంభీరమానసంతో మౌనముద్రాంకితుడైనాడు. కాని లోలోపల గాఢాంధకారబంధురమైన యీ నిశీథంలో తన పన్నుగడలకీలకం ఎల్లా విరోధిమూకల కందుబాటైందా! అనే యాతనమాత్రం ఆ త్యాగమూర్తిని మిక్కిలి దహించదొడగింది. అనుక్షణం రివ్వురువ్వున పైకొను గుండ్లవర్షం శారినుండి బయటపడగలిగాడు. మణిబంధం వ్యథదుస్సహంగా తోచింది. చిదురు చిదురై వ్రేలాడుతున్న ఎముకల నరాలరాపిడి పీడను వైదొలగించుటకుద్యుక్తుడైనాడు. హఠాత్తుగా నడుంపటకాలో వ్రేలాడుచుండిన నిశిత ఖడ్గరాజమును చివాలునలాగి ఒక్కవ్రేటున ఆ మలిన హస్తాన్ని ఖండించివేశాడు. రక్తస్రవంతుల వెగజిందే ఆ ఖండితహస్తభాగాన్ని భక్తిపూర్వకంగా గంగానదీమతల్లి గర్భంలోనికి విసిరివేయుచు "మాతా భాగీరథీ! ఈ అమూల్య పుణ్యార్ఘ్యాన్ని ఆనందపూర్వకంగా స్వీకరించుముతల్లీ! నీ కుమారుని అంత్యమహార్ఘ్యాన్ని చేకొమ్మమ్మా!" అన్నాడు

అవనత శిరస్కులై కన్నులు ముకుళించినారు. ఆ అద్భుత దృశ్యాన్ని అవలోకించిన వీరుల నయనగోళాలనుండి ఆనంద బాష్పములు కదలాడినవి. ఆ త్యాగోద్రేకం ప్రస్ఫుటించింది.

తమ ప్రభువు కుమరసింగు పునరాగమనంతో జగదీశ పురంలోని ఆబాలగోపాలం మహాసేనగా మారిపోయారు. ప్రజావిప్లవం పసికట్టిన ఆంగ్లేయాధికారులు పాలెగాండ్ర చేతిలో నిడికొని బ్రతుకుజీవుడా అని కాలికిబుద్ధి చెప్పారు. జగదీశపురం కుమరసింగు ఆధీనమైపోయింది. క్రీ. శ. 1858 ఏప్రియలు 23వ తారీఖున తన సింహాసనాన్ని ద్విగుణీకృతోత్సాహంతో నధిష్ఠించాడు.

జగదీశపురంపు విప్లవ సమరసేనాని రాణా కుమర సింహుడు పునరాక్రమణం జేసినవార్త బ్రిటిషు సేనాపతులకు తీరని అప్రతిష్ఠ చేకూర్చింది. జనరల్ లీగ్రాండ్ దారుణ ఆ అవ మానాన్ని సహించలేక గొప్పపటాలంతో జగదీశపురంపైన ముట్టడి చేశాడు. హస్తాన్ని గోల్పోయి పచ్చిగాయంతో బాధపడుతున్న ఆ వృద్ధ సింహానికి ఎక్కడలేని తెగువ పొర్లి వచ్చింది. ఆ శూరాగ్రేసరుని అంతరంగం అగ్నిపర్వతంలా ప్రేలిపోయింది. ప్రళయ కాలరుద్రుని క్రోధాగ్నిలో ప్రభ వించిన దంష్ట్రోద్ధార విధ్వంసిగా మహోగ్రస్వరూపం దాల్చి నాడు. శాత్రవ సేనావ్యూహాలలో హాహాకారాలు నింగి

ముట్టినాయి. ఆనాటిది పోరాటం కాదు. శత్రుహనన మృత్యు క్రీడాశలాపంగా మాత్రం ద్యోతకమైనదట. ఆ యుద్ధేచ్ఛా సంహారక్రియా విహారంలో ఆ శత వృద్ధుడు మధ్యందిన మార్తాండుడుగా ప్రత్యక్షమైనాడు. రిపుదళాలు విదళితములై పోయినవి. మిత్తివాతబడని అరివీరు లరచేత ప్రాణాలిడుకొని బ్రతుకు జీవుడాయని దిక్కుతోకరైనారు. దురభిమాని జనరల్ లీగ్రాండ్ గుర్తుపట్టరాని స్థితిలో పీనుగు పెంటలలో కానోకవైనాడు. రాణా కుమరసింహుని ప్రతాపానికడ్డు లేకుండాపోయినది.

నాటి చరిత్రలో అఖండప్రతిభనుజూపి పోరాట్టుకున్న వంశ క్రమాగత రాజగద్దియను పునరాక్రమణ జేసికున్న స్వాతంత్ర్య వీర కేసరి రాణాకుమరసింహుడొక్కడే. పండి పోయిన ఆ కాయంలో అగాయం మానిందికాదు. అదే కాలమృత్యువుగా ఆ పవిత్ర జీవితాన్ని కీర్తి శేష మొనర్చింది. సింహాసన మధిష్ఠించిన మాసము ముగియకమున్నే ఆ ఆదర్శ వీరుడు వీరస్వర్గమలంకరించాడు. జగదీశపుర సంస్థానం కాల గర్భంలో గలిసిపోయింది.

ఆదర్శచరితుడైన ఆ మహనీయుని వీరగాథ నేటికీ బీహారు ప్రాంతంలో గానం చేయబడుతోంది. అమరమూర్తి కుమరసింగు స్వాతంత్ర్యామభూతి ననుభవించి ఆ పవిత్ర వాతావరణంలో కైవల్యం అందుకున్నాడు. భావిదుఃఖగాథ వారికి మనోవేదనను కల్పించిందికాదు. వారు ధన్యులు. వారిగన్న భారతమాత మహాభాగ్యరాలు.

"కనుకమ్మెల్ గదుకొనుకాంతులనుజిల్కా నాగమ్ములందు చ
క్కనిదేహంబొక యింతనిక్కి కదుపింగారంబు హెచ్చింప ని
ల్చిన సీమంతిని విగ్రహమ్మనగ లాలిత్యమ్మునన్ మీఱు సం
గనలై వీరరసంబునిల్చె నాయనన్ గానుందె గన్పండునై."

— 'జాతీయకవి'

3

ఝాన్సీ మహారాణి దివ్యమూర్తివంతం స్వాతంత్ర్య దేవతావిస్ఫూర్తిని స్మరింపజేసేది. ఆ ముత్యాలకుచ్చులతో నిగనిగలాడే కేసరివన్నె తలపాగా తీర్చిదిద్దబడిన సుదీర్ఘ కంచుకం కుచ్చెళ్ళతో వలుదయై కీవిని జనింపకేయు పఠాణీ పాయిజామా హస్తత్రాణ పాదత్రాణములతో పాయుపోచిత మైన గంభీర ముఖారవిందం నూతనోత్తేజాన్ని వెదజల్లేట్టు మున్నాబై నడుంపటకాలోని వెండితొడుగులుగల రెండుపిస్తోళ్ల నడుమ కాలనాగంవలె వేలాడు విమలవిశాగ్రకరవాలం మిలుమిట్లుగొలుపుచుండ చూపరులకు దిగ్భ్రమకలిగించేదట ఆ భయదగంభీరమూర్తివంతం దిలకించిన స్వాతంత్ర్యవీరుల రక్తం యుద్ధోన్మాదంతో ఉప్పొంగిపోయి తన్మయులకేసేదట రేయింబవళ్లు అశ్వరాజమధిరోహించి రికాబుల్లోని పాదాలను వెలిదీయకుండా తదేకదీక్షతో ఇంగ్లీషు సేనలతో తలపడి పోరు ఘోరమొనర్చే ఆవీరనారీమతల్లిలోని సాహసం ఆత్మాభిమానం, పిఱికిబాఱని గుండెలతో అంతిమక్షణంవరకు నిర్భ

యంగా డీకొనునట్లు విప్లవవీరుల నుత్సాహపఱచేవట. ఆయన యుద్ధకౌశలం వ్యూహరచనాదక్షత ప్రాణాలను సరకుచేయని తెగువదనం ఎన్నడూ వెన్నుజూపని ఆత్మాభిమానం మనోనైర్మల్యం అదృశ్యప్రాయాలేకాదు పూజనీయాలుకూడా,

ఝాన్సీకోటను 1858 సంవత్సరం మార్చి 23-వ తారీఖున బ్రిటిషు క్రొత్త పటాలములు ముట్టడించాయి. నేలయీనినట్లు కోటను నాల్గుమూలలనుండి క్రమ్ముకొనుచున్న విరోధిసేనలగాంచి కించిత్తయినా మహారాణి చలించినదికాదు. తన రణకౌశలాన్ని ముమ్మూర్తులా ప్రదర్శించుతరుణం ఆసన్నమైనందులకెంతో గర్వించింది. అసహాయశూరులై స్వాతంత్ర్యసేనల బ్రిటిషు పటాలములపై ఉద్రేకించింది. శతఘ్నీదళాల కివ్వవలసిన ఆదేశాల నందించింది. ఎదిరి బలాబలాల దుర్భిణీలసహాయంతో అవగాహన చేసుకున్నది. హిందూ ముసల్మానులలో అరమరికలు దలనూపకుండా "మనం భారతీయులం మన మాతృభూమి స్వాతంత్ర్యాన్ని ముందు నిల్వరించుకోనిదే ఏ సంస్కృతీ నిలువదు. అంతా క్రైస్తవ మత పిశాచి మ్రింగివేస్తుంది. భావదాస్యమేకాకుండా సాంఘిక దాస్యంకూడా దాపురిస్తుంది, భౌతికపతనమేకాదు ఆధ్యాత్మికపతనంకూడా ప్రాప్తిస్తుంది. ఆత్మాభిమానం నిలబెట్టుకోవటమో ఆత్మార్పణంచేయడమో మన విధ్యుక్తధర్మం"

అని ఎలుగెత్తి చాటింది. స్వాతంత్ర్య సేన లసమాన సాహసాన్ని ప్రదర్శించాయి. సయోద్ధతో స్వైరవిహారం చేశాయి.

విరోధుల శతఘ్నిదళాల కాలుపాగలనుంచి దూసుకవస్తున్న అసంఖ్యాకములైన అగ్నిగోళాల తాకిడికి ఝాన్సీకోట ఉఱ్ఱూతలూగింది. కాని స్వాతంత్ర్యదీక్షాబద్ధమైన మహారాణి గుండెదిటవుమాత్రం సన్నగిల్లింది కాదు. కోట బురుజులపై శతఘ్నిగోళనివారకులైన వీరాగ్రేసరులస్థానం అప్పటి కప్పుడే ప్రాతినిధ్యంవహిస్తూవుండేది. ఘడియఘడియకు అరితేరిన ఘటికులతో గూడిన బ్రిటిషు రెజిమెంట్లు పెల్లుబికివస్తున్నవి. ముట్టడి అభేద్యమైపోయింది.

దులాజీరావనే దేశద్రోహి తోడ్పాటుతో కోటరహస్యాల గుర్తించిన తెల్లసేనాముల పెనుముట్టడుల ధాటికి ఝాన్సీకోట కావలికుడ్యం శిథిలపడింది. దేశద్రోహులు ఝాన్సీకోట రహస్యాల వెల్లడిచేయడంవల్ల బ్రిటిషువారా అవకాశంతో కోటనాక్రమించగలిగారు. నగరంలో హాహాకారాలు రేగినాయి. నగరముట్టడితో అసంఖ్యాకులు ఫిరంగిగుండ్ల కాహుతికాజొచ్చినారు. రాజప్రసాదములు పీనుగుపెంటలతో భీభత్సరూపందాల్చినవి. మహారాణి వారము రోజులకంటే ఎక్కువకాలం అత్యద్భుత యుద్ధప్రతిభను సాటినప్పటికి ఝాన్సీకోటను రక్షించలేకపోయినది.

కాలపికోటనుండి ఝాన్సీరక్షణకువచ్చిన విప్లవయోధాగ్రేసరుడు తాంతియాతోపే తన అసాధారణప్రజ్ఞను బురి

డించి బ్రిటీషు సేనావ్యూహాన్ని చీల్చి చెండాడగలిగినా కూడా విఫలురైనాడు. చేయునది లేక తొలిపరాజయంగా 'కాల్పికి' తిరుగముఖం పెట్టినాడు. మహారాణి హృదయం తీవ్రవేదనతో క్రాగిపోయినది. ఝాన్సీకోటలోని శతఘ్నులు శస్త్ర సముదాయం మందుగుండుసామగ్రి బ్రిటీషువారికి దక్కింది. తెల్లసిపాయీలు పట్టణంలో మారణహోమం జరిపించారు. నిరపరాధులు నిరాయుధులైన అమాయిక ప్రజలపై జరుపబడే అమానుషిక హత్యాకాండ మహారాణిని నిలువునా దహించివేసింది. ప్రాణాలకు తెగించి ద్వంద్వయుద్ధం ప్రేరేపించింది. ప్రళయకాలభైరవిగా లక్ష్మీబాయి కోట గుమ్మం వదలి వెలికురికింది. ఆ ధర్మయుద్ధంలో మహారాణి కెదురుపడి శవాలతో వెనుదిరిగిన తెల్లవాడే లేడు. రక్తస్రవంతులలో బ్రిటీషు సోల్జర్ల శిరస్సులు తేలియాడినాయి. బ్రతుకు జీవుడాయని రాక్షసకృత్యాలమాని ఆంగ్లేయ సైనికులు పలాయనమంత్రం పఠించారు. కాని గుండ్లవర్షం ముంచుకపోయింది. ఆ వీరనారీలలామ గడ్డుసమస్య నెదుర్కొనవలసివచ్చినది. స్వాతంత్ర్యసంగ్రామం ప్రధాన కర్తవ్యంగా భావించి కాల్పికోట చేరడమా లేక ఆఖరి నెత్తురుబొట్టు నేలకుట్టుదాక ఝాన్సీకోటలోనే పోరుసాగించి అసువులర్పించడమా!

కోట శిథిలావస్థను భవిష్యత్కార్యాచరణమును గుర్తించి, [illegible] కాల్పికోటచేరుట ఉత్తమమార్గంగా

సూచించారు. కాలపినే కేంద్రస్థానంగా స్వాతంత్ర్యసమర సేనానాయకులందరు అంతిమ పోరాటాన్ని సాగించ నిశ్చయించుకున్నారు. నానాసాహెబు పక్షమున తాంతియాతోపే లత్యంతశ్రద్ధతో సేనల సమీకరించుకొన్నారు. వెనుకముందైన సేనల కాదేశాలందజేశారు. మహారాణి లక్ష్మీబాయి శేషించిన స్వాతంత్ర్యయోధులతో 'కాలపికోట' వైపు మరల వలసివచ్చినది.

౩

ఝాన్సీరాణి ప్రస్థానంతో ఝాన్సీనగరంలో కోలాహలంచెలరేగింది. ఆటవిక క్రూరమృగాలవలె తెల్లసిపాయీలు తమ అభీష్టం నిరాటంకంగా నెరవేర్చుకున్నారు. అతిదారుణం అమానుషికం! పైశాచికం! ప్రాణరక్షణకై తొట్రుపడుతూ పారిపోతున్న శతవృద్ధులను తుపాకిగుండ్ల కెరచేశారు. నవయువకులను రాజవీధుల ప్రక్క ఉన్న వృక్షములకు తలక్రిందులుగా వ్రేలాడదీసి కుత్తుకలగోసినారు. నగరాన్ని నిర్మానుష్యంజేశారు. సకలసంపదలను లూటీజేశారు. భవనాలను పరశురామప్రీతికర్పించారు. శతాబ్దాలతరబడి సేకరించబడి అతి ప్రాచీనమైన అమూల్య గ్రంథాలతో భారత ప్రాశస్త్యమునందియుండిన పుస్తకభాండాగారాన్నిగూడా ఆ కిరాతకులు దగ్ధపటలంచేశారు. ఝాన్సీరాజ్య కులదేవత మహాలక్ష్మీమందిరాన్నిసైతం దోపుచేశారు.

తెల్లసైనికులకీ గ్వాలియర్లో లభ్యపడిన అమూల్యాభరణాలు వస్తువాహనాలు బంగారు వెండిసామగ్రిలు కానుకలక్రింద పంచబడ్డాయి. ఝాన్సీనగరం స్మశానంగా మార్చివేయబడింది. రుధిరప్రవంతులతో రాజవీధులు మలినభూయిష్ఠములై పోయినవి. కాని ఆరక్తచ్ఛాయల్లో స్వాతంత్ర్యజ్యోతి కళవళికలు ధ్రువతారలై పోయినవి.

మహారాణి లక్ష్మీబాయిని పలాయితురాలుగా భావించి లెప్టినెంటు బౌకర్ అశ్వికదళంతో వెన్నాడి భాండారే గ్రామంలో ఆమెను ఎదుర్కొన్నాడు. తన్ను వెంటాడివచ్చిన ఆంగ్లేయ సేనానిని జూడగానే మహారాణి క్రోధోన్మత్తురాలై పోయింది. దత్తపుత్రుడైన కుమారదామోదరుని వెన్నున గీలించుకొని ఖడ్గహస్తయై ఉక్కుపిండంలా బౌకర్ను కవిసింది. ఘోరాతిఘోరంగా తన శస్త్రనైపుణి ప్రదర్శించి బ్రిటిషు రాష్ట్రభటుల భరతంపట్టించింది. ప్రతీకార దవానలంతో పరితపించే ఆయమహృదయాగ్ని కిదొక సదవకాశంగా విజృంభించిపోయింది. ఒక్కొక్కరొక్కరుగా సోల్జర్లు ధూళిపాలయిపోయారు. ఆ భీమస్వరూపం ఎదుట ఆకరాళకరవాలం ఎదుట లెప్టినెంటు బౌకర్ ఎదలో మృత్యుభీతి తాండవించింది. అసమాన ప్రతిభాశాలియైన లెప్టినెంటు బౌకర్, వజ్రసమతేజస్విని మహారాణి కత్తిపోటులకుగురియై జీవచ్ఛవంగా నేలగూలినాడు. వీరరాణి వికటభ్రుకుటి తెల్లమొగాల నవహేళనచేయగలిగినది. ఆ స్వాతంత్ర్య సమరజ్యోతి తన కసిదీర్చు

కౌగలించినది, కాని తెప్పించుకు పోకరు అసువుల రక్షించుకో గలిగాము.

మహారాణి లక్ష్మీబాయి నిర్భయంగా కాలపిని సమీపించినది. బాల్యస్నేహితురాలు సోదరి లక్ష్మీబాయిని చూడగానే పేష్వారావుసాహెబున్ను నానాసాహెబు పన్నవీసున్ను అమందానందంతో తమ్ముతామే మఱచిపోయినారు ఆనందాశ్రువులతో ఆయమకు స్వాగతమిచ్చారు. వీరలక్ష్మి మహారాణి సైతం సర్వస్వం స్వాతంత్ర్యోద్యమానికి ధారాదత్తం జేసి అవిరళకృషి యొనర్చుచున్న సోదరతుల్యులు దేశభక్తులు నానాసాహెబు పన్నవీసు రావుసాహెబులకు కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలంద జేసింది.



# పోరాటం ద్వితీయ ఘట్టం

తనిసిరే వేల్పు లుదధిరత్నముల చేత
వెఱచిరే ఘోరకాకోల విషము చేత
విడచిరే యత్నమమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు విడువరు నిపుణమతులు.

— భర్తృహరి

1858 జూన్ 12-వ తారీఖున కాల్పీకోట నూతనోత్సాహంతో వెల్లివిరిసిపోయింది. స్వాతంత్ర్యసమర మహారథికులు నానాసాహెబుపష్వీసు, ఝాన్సీమహారాణి, తాంతియాతోపే రావుసాహెబు బాందానవాబులు తదితర విప్లవయోధులు సమావేశమైనారు. అంతిమ పోరాట సన్నాహాలు జోరుగా జరిగిపోతున్నాయి. యోధానుయోధుల పరామర్శ జరిగినది. సైన్యాధిపత్యం ప్రశ్న ఉదయించింది. నానాపష్వీసు వెనుకముందాడసాగినాడు. తాంతియాతోపే ఉదాసీనభావం వహించినాడు. సేనావ్యూహ రచనల్లోనేగాక తాత్కాలిక వివేచనా శక్తిసామర్థ్యాలు మహారాణి లక్ష్మీబాయిలో అపారంగాయున్నవి. అయిను కాధిపత్యం కట్టబెట్టడం ఎంతో సమంజసం. సైన్యాలలోని బహుళసంఖ్యాకుల అభీష్టంకూడా అదియే కాని పేష్వారావుసాహెబు

కాభావం రుచించలేదు. ఆడువారి కింతటిబాధ్యత సప్ప గించడం ససేమిరా కూడదన్నారు. అశ్వికదళాలలో అసం తృప్తి ప్రబలిపోయింది.

నానాసాహెబుపడ్నవీసు తానే సర్వసేనాధిపతి బాధ్య తను వరించాడు. కాని సైన్యసమీకరణదక్షత వ్యూహరచ నాసమర్థత లోపించినందువల్ల శత్రుశిబిరాలపై ముట్టడుల సాగించి తమసహజ శక్తిసామర్థ్యాల బ్రిటిషు పటాలములకు రుచిచూపించే సావకాశం అశ్వికదళానికి లేకపోయింది. ఉన్న మంచి అవకాశాలను జారవిడువ వలసివచ్చింది. మహిళగా జన్మించినందుననే ఝాన్సీమహారాణి సైన్యాధిపత్యమున కనర్హురాలయిపోయింది. ఆమెలోని శక్తిసామర్థ్యాలు లెక్కకురాలేదు. ఆయమ నామమాత్రపు సేనాధిపురాలుగా మార్పుచెందింది. యుద్ధనిర్వహణాధికారం వ్యూహరచనా తంత్రాంగం ఆమెచేయిజారిపోయినందున ఆ వీరవనిత స్వేచ్ఛావిహారశక్తిని గోల్పోయింది. స్వాతంత్ర్యదీక్షా నిబద్ధ స్వాంతం ఆకొద్దిపాటి సేనలతోటే అపూర్వ సంగ్రామ కౌశలం జూపెట్టగలిగింది.

ఇంగ్లీషు పటాలము లొకటివెంబడి మరియొకటి ఆరి తేరిన సేనానాయకుల పర్యవేక్షణక్రింద శతఘ్నిదళాలతో కాలపికోట కెగబ్రాకినాయి. ఆంగ్లేయులదృష్టి పరిపూర్ణంగా ఈ వైపు తరలింపబడింది. ఉత్తరదేశంలోని తిరుగుబాటు

సైన్యములు కొన్ని పరాజయముల పాలైపోయినవి. కొన్ని ముట్టడులలో చిక్కుపడిపోయినవి. మైసూరు హైదరాబ్ సేనలకు నైజాం సైంధవుడులా అడ్డుపడ్డాడు.

దీర్ఘకాల పోరాటాన్ని సాగించే అవకాశాలు లేనందున ఎక్కడిసేనలక్కడ దిగ్బంధాల్లో తగుల్కొనిపోయినవి. ఉత్తర హిందూస్థానములో ఏ ఒకటిరెండు స్థావరాల్లో తప్ప తక్కిన నగరాల్లోని తిరుగుబాటు ఘోరనష్టాలకు గురియై అణగారిపోయింది. కాలపికోటరక్షణకు ఏప్రాంతంలోని విప్లవ సేనలతోడ్పాటూ లభించే అవకాశం సున్న. కేవలం స్వశక్తి పై పూర్తివిశ్వాసముంచి పోరాడవలసిన మహత్తరబాధ్యత పేష్వారావుసాహెబు, నానాసాహెబుపక్షనేసు తాంతియా తోపే, ఝాన్సీమహారాణి చాందానవాబులపై పడింది. నానాసాహెబుకు ఈ విషమస్థితిలోసహితం సేనాధిపత్యాన్ని యోగ్యులకు కట్టబెట్టేసంకల్పం జనించలేదు. ఆదురభిమానం తోటే ఉండిపోయాడు.

యుద్ధతంత్రవిశారద కూలంకష ప్రజ్ఞామతి లక్ష్మీబాయి బాల్యాభిమానాన్ని పురస్కరించుకొని సోదరతుల్యుడైన నానాసాహెబును సమీపించి తనలోని వ్యూహాపోహల నివే దించినది. తనకుడా పట్టంగట్టుకున్న బలుసిపాయిగా ముందం జవేసింది. ప్రాణాలపై ఆశలేని కొద్దిమంది అశ్వికభటులతో అకస్మాత్తుగా, తీవ్రంగా ముట్టడికి ఆయత్తపడుతున్న దక్షిణా

వైపునయున్న ఆంగ్లేయశతఘ్నిపటాలంపై విరుచుకపడింది. ఈ హఠాత్ సంఘటనలో బ్రిటిషుశతఘ్నిదళం స్తంభించిపోయింది, దొమ్మియుద్ధం ప్రచండోద్వేగంతో చెలరేగింది. స్వాతంత్ర్యసేనల కనంతసాహసం పెల్లుబికింది. "హరహర మహాదేవ్" "హరహరమహాదేవ్" విజయధ్వానాలు అంబరవీధి ప్రతిధ్వనించాయి. వెంటపులిగవలె మహారాణి లక్ష్మీబాయి భీకరకరవాలం బ్రిటిషు సోల్జర్ల కంఠాలపై ప్రళయతాండవం సలిపింది. ఆ వీరనారీమణి అసమాన ప్రతాపజ్వాలలే విరోధిమూకల బలిపెట్టుచున్నాయి. ప్రత్యక్ష కాళీమాతవలె అడ్డులేకుండా వీరవిహారంచేస్తున్న ఆసౌందర్యవతి ఎదిరిబలాల నిర్వీర్యుల పలాయితుల చేస్తున్నది. ఆమె మానవమాత్రురాలుగా నాకు కన్పించిందికాదు. మంత్రముగ్ధులైపోయిన బ్రిటిషు పటాలాలకు ఆంగ్లసర్వసేనాని సర్ హ్యూరోజ్ రాజనీతి తంత్రాంగమంతా ఆదినం బూడిదలోపోసిన పన్నీరై పోయింది.

బ్రిటిషువారిలో ఉన్నట్టుండి ఉత్సాహం తలచూపింది. కారణం అసంఖ్యాకములైన క్రొత్తసేనలువచ్చి కలిసికున్నాయి. బ్రిగేడియర్ స్టువర్టుసేనాని సర్వసేనాని హ్యూరోజుకు తోడ్పడ్డాడు. హ్యూరోజుపథకం ఫలించింది. మహారాణికి అండలేకపోయింది, క్రొత్తసేనలరాకతో క్రొత్తఎత్తులెత్తవలసివచ్చింది. అతిజాగ్రత్తతో తనయోధుల వెంటబెట్టుకొని కోటవైపు మరలింది.

నూతన పటాలముల రాకతో నిరాశాపిశాచమావహించి చింతాక్రాంతుడై కుములుతున్న పీష్వారావుసాహెబుకు ధైర్యవచనాలతో స్థిమితంచేకూర్చేందుకు మహారాణి పరుగెత్తవలసివచ్చింది. అతడయోమయంలో జీవితాశతో పెనగులాడుతున్నాడు. పాపం కార్యశూరుడు తాంతియా తోపే సందిగ్ధావస్థలో చిక్కుకున్నాడు. నానాసాహెబుపడ్డ పీసు తన అసమర్థతను గుర్తించలేకపోయాడు. అదిఅంతం లేకుండా బ్రిటిషు సేనలపారంగా గుప్పించివేయబడుతున్నాయి. యుద్ధతంత్ర నిర్వాహణానుభవశాలురైన ఆంగ్లేయ సేనాపతులందరూ ఒక్కపెట్టున మూగుతున్నారు. ఇక గత్యంతరంఏది! కాలపి పతనం అట్టేదూరంలో లేదు. తాంత్యాతోపే, బాందానవాబ్‌లు మహారాణి లక్ష్మీబాయితో భవిష్యత్కర్తవ్యాన్ని సంప్రతించారు.

మహారాణి ఆలోచనప్రకారం కాలపీకోటను ఈప్రమాదస్థితిలో విడచిపెట్టడం శ్రేయోదాయకంఅనే నిర్ణయానికి వచ్చారు. అఘటనాఘటన సమర్థుడైన అతిసాహస హృదయుడు తంత్యాతోపే ఏకాకిగా బ్రిటిషువారి కండ్లుగప్పి మారువేషంతో గ్వాలియరు చేరుకున్నాడు. అక్కడి సర్దారులతో సంప్రతించి ఒక నిర్ణీతకార్యక్రమం రచించాడు. మహారాణికి నివేదించాడు. మహారాణి మానసికావేదన ఒక్కింత తమించింది, నూతనోత్తేజం ముఖారవిందలో వికసించింది.

ద్విగుణీకృతోత్సాహంతో రికాబుల్లో పాదాలానింది. విప్లవ సేన ఉన్నట్లుండి కాలడిచి వీడువెట్టిపోవడం ఆంగ్లేయుల కర్థం కాలేదు. కేవలం పలాయనమంత్రం పఠించడంగా భావించారు.

తెరిచినిలు కుక్కలు ప్రవేశించులాగా హేమాహేమీలైన బ్రిటిషు యోధాగ్రేసరులు కాల్పికోటలో ప్రవేశించారు. అచ్చట స్వాతంత్ర్యసేనలు విడిచిపోయిన అపార యుద్ధసామగ్రి నానందంతో సర్ హ్యూరోజ్ అధీనం చేసుకున్నాడు. అమాయిక ప్రజపై దారుణహత్యాకాండ యథావిధి జరిపించు ఆదేశం మహాకౄరస్వరూపం దాల్చింది.

ఆంగ్లేయ సేనాధిపులందరు విజయధ్వజాన్ని ఎగురవేశారు. సిపాయీల తిరుగుబాటును రూపుమాపినట్లు భ్రమించుకున్నారు. విశ్రాంతి పుచ్చుకున్నారు. కొందరు మాత్రం ఝాన్సీరాణి, తాంత్యాతోపేల ఆచూకీ తీసేందుకు ముందుకేగినారు. ఆ హిందూ వీరనారి యుద్ధకౌశలాన్ని ప్రాణాల సరకు గావని తెంపును మూచి ఈమె ప్రాంసుదేశ స్వాతంత్ర్యమూర్తి జేవీశానాఫ్ఆర్కుకు దీటయిన మహాశక్తిమంతురాలు ఏలాగైనా [illegible] యుద్ధఖైదీగా నిర్బంధించి తీరాలి. ప్రాణాలతో అసంభవమైతే ప్రాణాలు తీసైనా ఆమె కళేబరాన్ని బ్రిటిషు పతాకం క్రిందపడవేయాలన్న ప్రబలాకాంక్షతో కెప్టెనులందరు ప్రతినబట్టినారు.

బ్రిటిషు కమాండర్‌ఛీఫ్ సర్ హ్యూరోజు తనకర్తవ్యం నెరవేరినట్లు విప్లవశక్తుల అణచివేయగలిగినట్లు గర్వించాడు. తనదిగ్విజయవార్తను స్వయంగా అందజేయు సంకల్పంతో సీమదేశానికి ప్రయాణసన్నద్ధుడైనాడు. బొంబాయిహార్బరుకు పయనమైపోయినాడు.

3

"అన్నా! దుర్గవిభుత్వమేమిసుఖమా యద్దానికై మీరు మీ
కన్నుల్ గుచ్చుకొనంగ నేల? పెరపోకల్ పోయి పేర్మిమాతృత
స్వన్నంబౌ శోక మాతృగర్భమును విచ్ఛేదించి పోయిర్ల న
న్నన్నా! చెత్తురవాని నేల మనలో నా యిట్టి పోరాటముల్".

శివభారతం

స్వాతంత్ర్యసేనలు గ్వాలియరుకోట దాపించునప్పటికి పిడుగువంటివార్త స్వాతంత్ర్యనాయకుల చెవినిబడింది. గ్వాలియర్ ప్రభువు ఆంగ్లేయుల ఆసాములో ఉన్నాడనే గడ్డుసమస్య ఎదుర్కొనింది. కాని తాంత్యాతోపే సామర్థ్యం అనుపమానం. దుర్గపాలురహృత్సీమల ద్రవింపజేశాడు. దేశభక్తి పూరించాడు. ఆ యోధమూర్తి తన అనన్యసామాన్య రాజకీయ పరిజ్ఞానం పూర్తిగా వినియోగించి గ్వాలియర్ సర్దారుల సహకారసంపత్తి నార్జించగలిగాడు.

గ్వాలియర్ ప్రభువు సింధ్యారావుసాహెబు సందేశాన్ని తృణీకరించి స్వాతంత్ర్యసేనల నెదిరించాడు. కాని మహారాణి

ప్రచండస్వరూపం కన్నులయెదుట తాండవించడంతో టి సైని కులలోని కలవరం సర్దారులలోని నిగూఢచింతనం గ్వాలియర్ ప్రభువునకు బ్రతుకుపై ఆసను ప్రేరేపించింది. తనపరివారంతో పలాయితుడైనాడు. బలవత్తరమైన గ్వాలియర్ రాజకోట సునాయాసంగా స్వాతంత్ర్యవీరులకు స్వాధీనమై పోయినది.

గ్వాలియర్ కోట అతి పురాతనమైనది. అభేద్యం అతి విశాలం అయినది. మహారాణి లక్ష్మీబాయి యీ మహాదానశాళం పరమాత్మ పారితోషికంగా భావించింది. బ్రిటిషు సేనల మట్టుబెట్టు మార్గాన్వేషణాలో లగ్నమైపోయింది. రావుసాహెబు కోటలో లభించిన పెన్నిధుల ధనధాన్యసంపదలతో గర్వించిపోయాడు. పీష్వా పట్టంగట్టుకున్నాడు. దిగ్విజయం సంప్రాప్తించినట్లు భ్రమించాడు. విలాసభోగాల్లో అదమరచి కర్తవ్యం విస్మరించాడు. రణరంగకోవిదుడు తాంత్యాతోపే సహితం ప్రభుత్వతత్వంలో మునిగిపోయాడు. రానున్న మహాప్రళయాన్ని భావించాడు కాడు. ఈదారాఖ్యాగ్యదామోదకుల అవివేకానికెంతో నొచ్చుకొని మహారాణి ప్రశ్నేయపడింది. నెత్తిన నోటబెట్టుకొని "ఇది ఉత్సవాలకు వినోదాలకు, సంతర్పణ సమారాధనలకు కాలంకాదు. ఆకాలం ఇంకా మనకు చాలాదూరంలో ఉంది. గ్వాలియరు సైన్యం సుశిక్షితంకాదు. క్రమశిక్షణ అసలేలేదు. వారిని సత్వరం సంస్కరించి కవాతులతో తర్ఫీదు చేయడం ప్రస్తుత

భాగ్యం లేకపోయింది. అశ్రద్ధయో కారణమందుమా కాదు చరిత్రపుటలలో భారతస్వాతంత్ర్యశకావిర్భావం ఇంకా వెనుకబడియుంది. కాలాన్నెవరు తిరస్కరింపగలరు! ఆ ప్రవాహం అప్రతిహతం. అనూహ్యం. ఎవరినేమని ఏమిప్రయోజనం! అందరూ త్యాగమూర్తులే! అఖండ ప్రజ్ఞాసుశిక్షితులే!

> “శశిభినుగాహ్యామున సతత శంభుమతంసమువయ్యు నోషధీ
> తతులకు నాథుడయ్యును సుధారసకేళినయయ్యు దారకా
> పతి తనరాజయక్ష్మ ధనబాధల బాపగనోపడక్కటా!
> హాతవిధికృత్య మెవ్వరికైన జగంబున దాటవచ్చునే.”

— భర్తృహరి



# అంతిమ ఘట్టం



సర్ హ్యూరోజు సర్వసేనాని బొంబాయి సమీపించునంతలో విప్లవసేనలు గ్వాలియరుదుర్గాన్ని ఆక్రమించుకొని విజృంభించుచున్న విషయం చావుకబురుగా అందవేయబడింది ఆ తెల్లదొర నిలువునా మండిపడ్డాడు. ఒళ్లుతెలియని ఆక్రోశంతో సీమ ప్రయాణాన్ని భగ్నంచేసుకొని వెనుదిరిగినాడు. ఒక్క అదటున కాలపి చేరుకున్నాడు. నిద్రాహారాలుమాని విప్లవబీజాల సమూలంనాశనంచేసే గాఢదీక్షతో పెద్దయెత్తున సమరసన్నాహాలు కావించాడు. ఆగ్రాకు పారిపోయియున్న గ్వాలియరు ప్రభువును రప్పించినాడు. బ్రిటిషువారు యుద్ధం చేయడం వానిరాజ్యం వానికిప్పించుటకే అనువదంతిని వ్యాపింప జేశాడు. గ్వాలియర్ దుర్గంలోని సేనలను భ్రమింప జేయు కుతంత్రములెన్నో పన్నినాడు.

కర్నల్ గేన్సు బ్రిగేడియర్ స్మిత్ ల ఆధిపత్యంక్రింద బ్రహ్మాండమైన దండయాత్ర గ్వాలియర్ వైపు నాయత్తపరిచాడు. సైన్యాలు గ్వాలియరును దాపించాయి. చతురస్త్రాల ముట్టడికి ప్లానులు బ్రిటిషు రాజనీతికోవిదులలో తలెత్తి

నాయి. ఆ యుద్ధంలోనే కాన్పోర్ తేల్చి వేయాలనే భల్లూక పుపట్టు వారిలో తీవ్రించింది.

పాపం దివ్యభోగవిలాసాల్లో దేలియాడుచుండిన రావు సాహెబుగారికి అకస్మాత్తు దండయాత్రాభీతి గొడ్డలిపెట్టయింది. విరోధి సేనాసమూహోద్ధతిజూచి పీష్వాకు గుండెలవిసి పోయినవి. కర్తవ్యతావిమూఢత్వంలో తనకై తాను తెచ్చిపెట్టుకున్న దారుణ పరకంఠది. ఝాన్సీ లక్ష్మీబాయి వాపోత నాదర్శమైనది. కాని ఇక చేసేదేమున్నది. తాంతియాతోపే కానాడు సేవలోని దుర్బలత్వం ఎదురైంది, అన్నిరంగాల్లోను అసమర్థ[illegible]యిన అశక్తులే గోచరించారు. కోట బురుజుల రక్ష[illegible] ఏర్పాటు లగాయతు కోట ద్వారపాలకుల [illegible] దవకుదానే పరుగులందోలి జవాబుదారీ వహించవలసివచ్చినది. ఆ తామ యస్థితి దాపురించింది.

ఎనుబోతులాంటిసిపాయీలు అసంఖ్యాకంగా ఉన్నారు వారిలో క్రమశిక్షణపూజ్యం. పైగా భోగవిలాసప్రియులు. అశ్రద్ధవారిసొత్తు. సుశిక్షితులు కానివారు గజబలులైనా ఏంప్రయోజనం. తాంత్యాతోపే అంతటి ప్రజ్ఞాశాలి అనుభవజ్ఞుడే పప్పులో కాలువేశాడు. చింతించిప్రయోజనం, గతజలసేతుబంధనం లాంటిదే!

ఈలాంటి తర్ఫీమలేని సిపాయీల మద్దత్తుతో ఆరితేరిన బ్రిటీషుపటాలములపై దెబ్బతీయాలి. చీపురతో సముద్ర తరంగాల నడ్డినట్లే కాదా. ఈవిషయం క్షుణ్ణంగా గుర్తించియే మహారాణి యుద్ధసన్నద్ధురాలైంది. చితారోహణకేగు భారతనారీతిలకంలాగా మరల ముస్తాబైంది. దత్తపుత్రుని దామోదరకుమారుని వీపున దట్టీలో సంధించినది. జయాపజయములతో నిమిత్తం లేకుండా తన విధ్యుక్తధర్మ నిర్వహణ కౌతూహలం వీరరాణి విపుల తేజోబింబంలో సందర్శింపబడింది నిష్కామప్రవృత్తి ఆమూర్తితో వెలిగింది.

> " సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయాజయౌ
> తతోయుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి "

(సుఖదుఃఖాల లాభాలాభాల జయాపజయాల సమాన దృష్టితో వాకొందించి ఎవడు యుద్ధంలో వీరవిహారం చేస్తాడో వానిని పాపములంటవు. ఇది పరమాత్ముని సిద్ధాంతము) గీత.

మహారాష్ట్రప్రాంతంలో మండగా యుద్ధం జరిగితీర వలసిందే ఆ స్వాతంత్ర్యజ్యోతి చిట్టచివరివరకు విస్ఫులింగోద్దీప్తి నలుగడలు ప్రజ్వల్యమానమై స్వేచ్ఛాకాంతుల వెదజల్లవలసిందే. అది అనివార్యం. గ్వాలియరు కోటబురుజంపై అఖండదీప్తి వెలిగించిన మహారాణి ఆ స్వాతంత్ర్య సేనాసమూహంలో 'హరహరమహాదేవ్' 'హరహరమహాదేవ్' 'దీన్ దీన్'

'దీన్ బిస్‌మిల్లా' అనే ఉత్తేజకరధ్వానాలు అనంతవిశ్వంలో మారుమోగినవి. ఈ జయజయారావాలతో ఆంగ్లేయుల గుండెలు పెట్లిపోయినవి. కించిత్తు చలించాయి. కాని సర్ హ్యూ రోజ్, జనరల్ నెపియర్, జనరల్ స్మిత్, కర్నల్ రాన్స్, కర్నల్ వేవీ, కెప్టన్ హేనేజ్ నీల్ వగైరా బ్రిటిష్ సేనాను లుద్దండులు. యుద్ధనీతిలో ఆరితేరిన ఘటాలు కావడంమూలాన తక్షణం సైన్యాలను సమాళించుకోగలిగారు. ఇరువాగుల పోరు ఘోరమైంది. ఆంగ్లేయులపాలు గ్వాలియర్ గ్రహపాటుగామారింది. అశిక్షితులైన ద్వారరక్షకులు ఫిరంగిదళాల ఘాతలకు చలించిపోయారు. రోహిలులు, పఠానులు, ప్రాణాలొడ్డి భీకర సంగ్రామం సాగించుతున్నారు. తదితర సేనాపరివారంలో అవలం రేకెత్తింది. వెనుకంజవేయడం పిరికిపాఱడం నిరుత్సాహానికి హేతువైంది మహారాణి యదార్థం గ్రహించింది. తాంతియాతోపే నాడు కాలభైరవ మూర్తిగా విరోధిమూకల అగ్నిగోళాల కావుతిచేస్తుండడం గమనించింది. కాని పీష్వారావుసాహెబు అతిభీతుడై నిస్తేజుడై పోయాడు. బాందావనవాబు ఘోరాజిలో సేనాసాగరం యీదుతున్నాడు. వీరావేశానికి తుది వీరశయనం.

మహారాణి వీరస్వర్గారోహణానికి పయనంగట్టింది. అంగరక్షకులైన రామచంద్రరావు, రఘునాథసింహులకివ్వవలసిన ఆదేశాలిచ్చివేసింది. ప్రాణస్నేహితురాండ్రు ఆదర్శ

వీరనారీశిరోమణులు కాశీబాయి, మందరాబాయీలతో హృదయంవిప్పి చెప్పివేసింది. గ్వాలియరుకోట అట్టేకాలం నిలువదు. లోపల రక్షణలకవకాశంలేదు. మనం త్యాగబలంతో శత్రువ్యూహాన్ని ఛేదించ సమకట్టాలి. అట్టి యోధుల సమీకరించమన్నది. అశ్వారూఢులైన మేలిజోదులు సంసిద్ధులైనారు. శాత్రవబలగం దుర్భేద్యంఅని తెలిసికొనే విరోధియూథంలోనికి కుప్పించింది. హఠాత్తుగా సంకుల యుద్ధం చెలరేగింది. సాక్షాత్తు మహాచండికలా రక్తంచిప్పిల్లే అరుణనేత్రాలతో మహారాణి సాక్షాత్కరించింది. కందుకముల్లా శిరస్సులు దొర్లిపోయినవి. రక్తసిక్త కళేబరాల బీభత్సదృశ్యం హాహాకారాల కెక్కలిపింది. ఆ ఉగ్రమూర్తి కెదురుపడ్డవాని కాయువు సమాప్తి. అది యుద్ధంకాదు ప్రళయహాస్యనృత్యం. ఆ స్వైరవిహారంలో ఆంగ్లేయ సేనానులు ముఖం తప్పించారు. ఎన్నో ప్రయత్నాలుచేశారు. కాని ఆ ధాటి నెదుర్కొనే సాహసం ఎవరికీ లేకపోయింది.

విప్లవసేనలుసైతం విజృంభించిపోయినవి. వారిరక్తం కాగిపోయింది. సింహగర్జనలుచేస్తూ బ్రిటిషు పటాలంపై బడ్డారు. ఆ తాకిడికి శాత్రవసేనలు ఛిన్నాభిన్నమైపోయినవి విప్లవయోధుల్లో "[illegible] భారత స్వాతంత్ర్యం [illegible] వీరస్వర్గం" అనే పవిత్ర భావోద్రేకం [illegible]. [illegible] మహారాణి [illegible] [illegible]

మహాదేవ్' అనే నినాదాలు మేఘగర్జనల్లాగా దిక్కులు పిక్కటిల్లాయి. ఆ మహానినాదాల్లో ఆ విప్లవమహాజ్యోతి నిర్భీతిగా వైరిదళాల కుత్తుకలు త్తరిస్తూ రక్తాభిషేకం చేసు కున్నట్లు రుధిరధారలతో మెఱపు మెఱసినట్లు ఎల్లరకు దృగ్గో చరమైనది ఆ మెమాత్రమే. మహారథికులైన నానాసాహెబు పన్నవీసు, తాంతియాతోపే, పీష్వారావుసాహెబు, చాందా నవాబులు ఆ మహాసాగరంలో తల్లీనులై కన్పించారు కారు.

విప్లవవీరులలోని దాహం కొంతతమించింది. ఇదే అదనుగా బ్రిటిషు వాళ్లర్ల ముట్టడి తీవ్రతరంచేయబడింది. ఒక్కొక్క రొక్కొక్కరుగా యోధులు వీరశయన మలంక రించదొడగినారు. ఆంగ్లేయ శతఘ్నిదళాల అగ్నిగోళాలకు విప్లవసైన్యం దిగ్భ్రమజెందింది. విరిగిపోయింది. స్వాతంత్ర్య ఆశాజ్యోతి మినుకుమినుకు లాడజొచ్చింది. చేసిన భగీరథ ప్రయత్నం విఫలంకాజొచ్చింది.



# పూర్ణాహుతి



దోషములు వచ్చువేళ గుణదుర్యుల ధైర్యగుణంబు సర్వగుణ్
బసచెడునంచు జూచెదవు పాపము దైవమ! యీ దురాగ్రహ
వ్యసనము మానుమాను ప్రళయంబున నీత నిజక్రమంబులై
సచెడెద వింతకంతయును, సాగరముల్ కులపర్వతావళుల్.

—భర్తృహరి

మహారాణికిదేమీ క్రొత్తవింతగాదు. ఆ వీర చరిత్ర గాత్రం అపాదమస్తకం కత్తిపోటులతో నిండి నిబిడీకృతమై రక్తధారల నెగచిమ్ముతూఉంది. ఇంక ఆ స్వాతంత్ర్యదేవి ప్రస్థానం అట్టేదూరం కాదేమోననే బెంగ అంగరక్షకులకు జనించింది.

ఏకాకిని అయిపోయిన భారత వీరనారీలలామ అంగరక్షకుల బలాత్కారంతో విధిలేక గ్వాలియరు యుద్ధరంగం నుండి ఆంగ్ల వ్యూహాన్ని చీల్చుకొని అశ్వికులతో ఎచ్చటికో పారిపోయింది. ఆత్మరక్షణార్థం గుఱ్ఱాల గాలిలో లేవదీసుకొని పోతున్న మహారాణిని వెన్నంటిన శాత్రవ అశ్వికబలాన్ని సంహరించి వీరరాణి ఆ ధూర్తుల శరీరాలు దుమ్ములో పొర్లాడ జేసింది. ఆ వీర నారీమతల్లి అమానుషిక సాహసం అనిర్వచనీయం.

నిరంతర రుధిరస్రావంతో ఆయన తనువల్లి కందిపోదొడగింది. అధిరోహించిన అశ్వరాజంసహితం గమనవేగంలో ఇంచుక క్రించుదనం జూపెట్టదొడగింది. కాని ఇంతలో వారల మరియొక బ్రిటీషు అశ్వికదళం వాయువేగంతో వెన్నాడింది. అంగరక్షణభారంలో తల్లీనమై అనుగమిస్తున్న కాశీబాయిని ఒక తెల్లసిపాయి తుటుపోటున నేలపాలు చేశాడు పాపం ఆ వీరనారి "అమ్మా సెలవు" అనే ఆర్తనాదం మహారాణి కర్ణకుహారాల్లో ధ్వనించిందో లేదో ఆ ఆశ్రితకల్పవల్లి దీర్ఘకరవాలంచే ఆ పాపిష్టుని శిరస్సు తెగి నేలకూలింది. అతడి కళేబరం అంతిమాహుతిగా ధూళిధూసరితమైపోయింది. ఇదే ఆ విప్లవదేవత మహారాణి లక్ష్మీబాయి తుదిపోటు.

ఝాన్సీ మహామాయి ఆత్మీయ బృందంతో సహా విరోధుల కదృశ్యమైపోయింది. గుఱ్ఱపుడెక్కల దుమారంసైతం కనుమఱుగై పోయింది. కాని దుర్విధి యెదుట కాలువ అడ్డగించింది. డస్సిపోయిన ఆ అశ్వరాజం ఆగిపోయింది. ఎంత ప్రయత్నించినా లంఘించలేకపోయింది. ఆలస్యం అమృతం విషం. బ్రిటిషు అశ్వికులు సమీపించారు.

తుపాకులు ప్రేల్చడం ప్రారంభించారు. తుపాకి గుండొకటి మహారాణి ముఖపద్మంను ఛేదించివైచినది, ఆ దెబ్బతో రాణి దక్షిణనేత్రం తెగి నేలబడింది. మహారాణి అశ్వరాజంపై

వాలిపోయింది. నెత్తురు కాల్వలుగట్టినాయి. అంతిమక్షణం సన్నిహితమైనది. మాతృమూర్తి వీరస్వర్గము లంకరించు ఘడియలు దాపించుట గమనించినతోడనే వారిలో క్రొత్త వ్యూహం పొడచూపింది. ఆ విప్లవ వీరాగ్రేసరు లంతిమ ఘాతగా అకస్మాత్తుగా ఆంగ్లేయ అశ్వికదళంపై కలియబడ్డారు. పాళాలపై తీవిగల ఆంగ్లేయ పార్శ్వంట్లు ఆ యోధుల ధాటికి తాళలేకపోయారు. ఆ దొమ్మీలో తెల్లవారి మొండెములే నేలదొర్లినాయి. మూకబలంగలిగీ ఆ విరికిపందలు కించిత్తు వెనుకంజవేశారు. కాని పోరాటంమాత్రం స్థంభించిందికాదు.

మహామాత పౌరుషలక్ష్మి లక్ష్మీబాయి ఆదేశం అందరి హృదయాల్లో తాండవిస్తూఉంది. "తన పవిత్ర దేహం విజాతీయుల హస్తగతంకారాదు. స్పృహదప్పిన మరుక్షణం లోనే అగ్నిజ్వాలలకర్పించాలి. ఈ ప్రతిజ్ఞ నెరవేర్చిననాడే వీరాంతు యథార్థమైన స్వామిభక్తులు" ఈ ఆదేశం పరిపాలించేనిమిత్తం ప్రతిభాశాలి అజ్ఞామవర్తి యోధశిఖామణియైన రామచంద్రరావు వేయికన్నులతో కాచియుండినాడు. మహామాత అశ్వరాజం మూపున వాలిపోగానే నెత్తురు ముద్దయియున్న ఆ పూజ్య దేహాన్ని గౌరవపురస్సరంగా కన్నీరుమున్నీరుగా గౌర ప్రక్కనయున్న గంగాదాసుబాబా అనే సాధు కుటీరంలోనికి తీసుకవెళ్ళినాడు. పాపం రామచంద్రరావు చేతులారా మాతృదేవత కంతిమసంస్కారం చేయ

నలోచప్పింది. అటుపై మహాభక్తుడు సాధుమూర్తి మహాసాత్వి లక్ష్మీబాయి కళేబరాన్ని గంగోదకాభిషేకంతో పునీతం చేశారు. రామచంద్రరావు భక్తిశ్రద్ధలతో ఆ స్వాతంత్ర్య దేవతకు అగ్నిసంస్కారక్రియ సాధుదేవుని సహాయంతో వేదోక్తంగా జరిపించారు. అత్యంత ఆప్యాయంతో అగ్నిదేవుడా వీరనారీమతల్లి భౌతిక కాయాన్ని తల్లీనంచేసుకున్నాడు. ఆ మాతృమూర్తి దీక్ష నెరవేర్పబడింది.

అపూర్ణాహుతిగొన్న చితిలోనుండి ఆ దివ్యశరీరాంతర్గతములై లేచిన విస్ఫులింగాలే విద్యుత్తరంగాలై యావద్భారతావనిలో ఆరని స్వాతంత్ర్యదీపికలై వెలుగొందినవి,

కర్మసాక్షి సూర్యభగవానుడస్తమించాడు. భారత స్వాతంత్ర్యపోరాట ప్రథమశకం సహితం అస్తమించిందా నాడు. కేవలం అన్యోన్యసహకారం చేసుకోలేకపోవడం ఒండొరులపై అసూయాగ్రస్తులుకావడం స్వార్థపరత్వంతో గులాములైలొంగడం మాతృదేశాన్ని ఆంగ్లేయుల పాలైయుటకు నాడు హేతువులయినాయి.



# ఉపసంహారం



మహారాణి నిర్యాణంతో స్వాతంత్ర్యసేనలు ఛిన్నా భిన్నం అయిపోయినవి. విప్లవచమూపతి నానాసాహెబు కుడిచేయి విరిగినట్లయినది. హతశేష సైన్యాల జిక్కబట్టు కొని కీలక స్థావరాన్వేషణంతో కాన్పూరువైపు సాగినాడు. కాన్పూరులో హెవలాక్ సేనాని బలిష్ఠమైన సిక్కు రెజిమెంట్ల తోను ఆరితేరిన బ్రిటిషు సోల్జర్ల పల్టనులతోను నిరీక్షిస్తు న్నాడు. నానాసాహెబుపడ్నవీసు నాడు విప్లవసేనానివహాలు కాలపీ దుర్గరక్షణంలగాయతు గ్వాలియరుకోట పతనంవరకు దీర్ఘపోరాటాలతో చవిచెడి యుండడంకు_ర్తించి యున్నందున కాన్పూరును మార్కొను తలంపు విరమించుకొని అన్య మార్గామిగామి కావడం తటస్థించింది. కొద్ది కాలానికి దాదాపు 50 వేలకు మించిన పటాలంతో నేపాలు ప్రభుత్వాం అండచేరినాడు. కాని నేపాలు సంస్థానవరేణ్యుడు అజేయు లైన ఆంగ్లేయశాసకులతో అకారణవైరాన్ని తెచ్చుకొనుట కిచ్చగింపక స్వాతంత్ర్య సేనల కాశ్రయమిచ్చుటకు నిరాక రించినాడు, ఫిరంగీదొరల పాదాక్రాంతుడై శూరాగ్రేసరు డైన మహాదేశభక్తుని నానాసాహెబుపడ్నవీసుని ససైన్యం

# దేశభక్తులకు ఆంగ్లేయులిచ్చిన పురస్కారం



ప్రథమ స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న
స్వాతంత్ర్య వీరులను ఫిరంగిల మూతులకుగట్టి
పేల్చి హత్యచేయుచున్న దృశ్యం

ఈ శతాబ్ది మహోన్నత వీరపూజనలచే
ఆ మహావీరుల ఆత్మలకు శాంతిచేకూరుగాక.

అసతోమా సద్గమయా - తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోర్మా అమృతంగమయా.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.



గా బ్రిటిష్ ఏజంటు స్వాధీనం చేశాడు. తానున్న తెల్లదొరల గులామై ప్రాణాలమోజుతో నిజాయితీకి నీళ్లువదిలాడు. ప్రథమ స్వాతంత్ర్య సమర సారథి మహారాష్ట్ర మహోజ్జ్వల తార నిశ్చయశాలి నానాసాహెబుపేష్వా ఏసు వీరోచితంగా ప్రాణసమర్పణం చేయవలసిన గడియలు సమీపించినాయి. కాని మహామేధానిధి త్యాగమనీషియైన నానాసాహెబుపేష్వా ఏసు బ్రిటిషుజాతి కండ్లల్లో దుమ్ముగొట్టి దేశభక్తుల సహాయంతో అంతర్ధానమైనాడు. తెల్లజాతిచేసిన విశ్వప్రయత్నాలు విఫలమైనాయి. హిమాలయ కందరాలలో యోగమూర్తియై సంచరించుచూ శేషజీవితాన్ని పరమాత్ముని అమూల్యసేవలో గడపినాడంటారు. మీదుమిక్కిలి ఒకపరి ఏవరికో యిరువదియేండ్లక్రిందట ప్రయాగక్షేత్రంలో కనిపించినారని కింవదంతి. ఆ మహనీయ చరిత్రుడు అఖండ ఖ్యాతిని భరతఖండానికి చేకూర్చినాడు.

మహాక్రాంతి సంచాలనాదక్షుడు, అసమానసంగ్రామ తంత్రాంగ ప్రవీణుడు, శత్రుభయంకర యోధాగ్రేసరుడు, తాంత్యాతోపే గ్వాలియరు దుర్గ పతనానంతరం గడితేరిన సిపాయీలదండుతో రణరంగంనుండి అదృశ్యుడై తెల్లదొరలకన్ను బ్రామి నర్మదాతటం చేరుకున్నాడు. తన సహచరులతో మంతనం జరిపించి మధ్యభారతంలో పోరాటాన్ని సాగించాలనుకున్నాడు. నర్మదానదినిదాటి మహారాష్ట్రంలో ఒకకీలక స్థానాన్ని ప్రవేశించాడు. గెరిల్లా పోటుల్లో మేటియైన తాంత్యాతోపే ఛత్రపతిశివాజీ మహా

రాకలాగా అసంఖ్యాకమైన బ్రిటిష్ రెజిమెంట్ల భరతం పట్టించదొరకున్నాడు.

అతి సాహసోపేతమైన తాంత్యాతోపే ముట్టడులకు మధ్యభారతంలోని సంస్థానాధీశ్వరులందరు ముగ్ధులై అత్యంతాదరాభిమానాలతో ఆవీరునిగౌరవిస్తూ సహాయసంపత్తుల కొఱత లేకుండా అందజేయజొచ్చినారు. కావలసిన ధనం యుద్ధ సామగ్రి లపారంగా అందుచుండడంతో తాంత్యాతోపే ఆంగ్లజాతి సోల్జర్లకు సాక్షాత్ మృత్యుదేవతగా భీతావహం చేకూర్చినాడు. సూర్యాస్తమయాలగాయతు సూర్యోదయం దాకా తెల్లసిపాయీలు ప్రాణాలరచేతిలో బెట్టుకొని నిద్రాహారాలుమాని తల్లడిల్లేవారట.

నాగపూర్ – బరోడా–ఝూల్రా – చోటాఉదయపూర్ వరగుండ మొదలైన ప్రాంతాల్లో వేనకువేలు తెల్ల మొగాలను మృత్యుగహ్వారానికి ఆహుతినిచ్చాడట. ప్రజాబలంతో తన లక్ష్యాన్ని నిర్విఘ్నంగా సాగించగలిగినాడు. ఆంగ్లేయుల గుండెల్లో కల్లోలాన్ని రెకెత్తించిన బలుసిపాయి తాంత్యాతోపేను ఎట్లయినా లోగొనాలనే దృఢసంకల్పంతో నాల్గువైపులా ముట్టడులు ఢీకొల్పినారు. మహాసేనానులొకరైనారు. సైన్యాన్ని కొడిగట్టినారు

ఈ యుదంతాన్ని కనిపెట్టిన తాంత్యాతోపే, చివరి సమావేశాన్ని ఏర్పాటుచేశాడు. తోపే, పీష్వారావుసాహేబు, పాదుషాఖాన్ ప్రభృతులైన విప్లవసేనాను [illegible] [illegible]. కర్తవ్య సమాలోచనాలలో లోతు

షాటుల పరిశీలించినారు. ఇంతలో జనరల్ హోమ్సుదొర ముట్టడించనున్నాడనే వేగువార్తలందడంమూలాన్న అసం పూర్ణంగానే ఆ సమావేశం అంతమైనది. అదే చివరివిప్లవ గణాధిదేవుల రణసమావేశం.

హోమ్సుదొర ఆక్రమణలో క్రాంతి దళాలు చాలా సన్నగిల్లిపోయినవి. దాదాపు తిరుగుబాటు పోరాటం ప్రగతి పథంలోనుండి స్తంభించిపోయింది. స్వాతంత్ర్య సేనావాహి నులు నాయకత్వాలోపంతో చెల్లాచెదరై దేవురుగొట్టులై పోయినవి. తాంత్యాతోపే ఏకాకియైపోయినాడు. సేనలా విఱిగిపోయినవి. అతిరథులు మహారథులుపథభ్రష్టులైపోయారు. దేశద్రోహుల మద్దత్తు ఆంగ్లేయుల కవలంబనం చేకూర్చింది. స్వార్థం పెరిగిపోయింది. త్యాగం బలిశాజొచ్చింది.

తరుణోపాయం తోచని తాంత్యాతోపే మిత్రాన్వేష ణంలో నిమగ్నుడైనాడు. తాంత్యాతోపే రహస్యమార్గంగా క్రాంతివీరుడు మానసింగుతో సంప్రతించుటకై కబురుచే శాడు. శివపురభయంకరాటవిలో ప్రవేశించాడు. మాన సింగుకు తాంత్యాతోపే గుట్టు ఆమూలాగ్రం తెలియునన్న నమ్మ కంతో బ్రిటిషు సేనాతంత్రజ్ఞులు ఆతనికి ఎన్నోఆశలు కల్పిం చారు. ఆ ప్రలోభాలకు పాల్పడ్డ మిత్రద్రోహి, దేశద్రోహి ఆంగ్లేయులకు క్రీతదాసుడై ఇది ఆకార్యమనుకోక రహస్యాం బయలు పరచినాడు.

ఆ విశ్వాసఘాతకుడు నిశీథంలో ఇంగ్లీషువాళ్ల మద్ద త్తుతో మహారణ్యాం ప్రవేశించి, తనకు ప్రాణస్నేహితుడైన

ఆ మహాపురుషుని, దేశస్వాతంత్ర్య దీక్షకై భోగవిలాసాల వర్జించి ఆజన్మం జితేంద్రియుడై నానాసాహెబుపడ్నవీసునకు దక్షిణహస్తంగా మసలిన త్యాగధనుని, మహాతపస్విని తాంత్యాతోపే సేనానిని నిద్రగూరియున్న తరుణంలో నిర్బంధింప జేశాడు. ఆ దేశభక్తుడు పునీతమూర్తి మానసింగు పతనానికి లజ్జపడి నొచ్చుకొని సహర్షంగా తనకుదా ఏ అవాంతరం లేకుండా ఆత్మసమర్పణంచేశాడు. మానసింగులాంటి జాతిద్రోహులే భారత అవనతికి నేటికీ కారకులగుచున్నారు. విప్లవ వీర కేసరి తాంత్యాతోపే తెల్లవారికి బందీ అయినాడు క్రీ. శ. 1859 ఏప్రియలు 18 వ తారీఖున ఆ మహాత్యాగ పురుషుని పవిత్ర దేహాన్ని ఫిరంగిమూతికిగట్టి ప్రేల్చివేయబడింది. క్రాంతికారు లభిలషించు మహాద్భాగ్యం అయ్యేదే కావచ్చు!

భారత విప్లవ మహా సంచాలకుడైన వీరతాంత్యాతోపే ఆస్తంగతుడైన విషాదవార్త కర్ణపుటాలభేదించగానే గుప్తకార్యక్రమంలోనున్న పీష్వారావుసాహెబు వికల మనస్కుడై కాన్పూరుచేరుకున్నాడు. మహాసేనానులొక్కొక్కరొక్కొక్కరే రాలిపోవుచున్నారు. బ్రిటిషు కిరాతకుల దౌర్జన్యకాండ పరాకాష్ట నందుకొన్నది. విక్టోరియా మహారాణి ధర్మప్రకటన వెలువడినప్పటికి కంపెనీపాలనలో గవర్నరు జనరలుగా ఉండిన కానింగు ప్రభువునే రాజప్రతినిధిగా ప్రకటించడంవల్ల శాసకుల మనోభావాలు మారినవికావు. ప్రతీకార దీక్షతో అవాచ్యములైన మానభంగాలు అవమానాలు చిత్రహింసలు పాశవిక కృత్యాలు యథేచ్ఛగా

ప్రజల భీతిల్ల జేయు ప్రబలోద్దేశంతో బ్రిటిషు సార్జంట్లు సాగి స్తూనే ఉన్నారు. మానవతులాత్మహత్యల పాలగుచున్నారు. మానధనులు జీవచ్ఛవాలయిపోతున్నారు. భారత ధరణి రక్తరంజితమై పోవుచున్నది. క్రాంతి అంకురములు ముకుళితములై పోయినవి. దేశద్రోహులసంఖ్య పెచ్చు పెరిగి పోతున్నది. పీష్వారావుసాహెబు ఉనికి గోప్యంగా నిలువలేక పోయింది. రావుసాహెబుపీష్వా బ్రిటిషుజాతి క్రూరపాశంలో తగుల్కొన్నాడు. ఆంగ్లేయశాసకుల దృష్ట్యా పీష్వా రాజద్రోహికావడంవల్ల క్రీ. శ. 1862 ఆగష్టు 20 వ తారీఖున మరణదండన విధించబడింది. మహానాయకుల శకం అంతరించింది. కాని వారు తమ అమూల్య రుధిరధారలతో వెలిగించిపోయిన స్వాతంత్ర్యజ్యోతి మాత్రం అజరామరంగా ప్రదీప్తవంతం కాజొచ్చింది.

*   *   *   *

త్యాగధనులైన ఆ భారతవీరుల సంకల్పం హింసాయుతచర్యలద్వారా గాకపోయినా అహింసాయుత సత్యాగ్రహసమరంద్వారా రాష్ట్రపిత గాంధీమహాత్ముని సేనాధిపత్యంతో 1947 సం. ఆగష్టుమాసం 15 తారీఖున భారతీయులకు స్వాతంత్ర్యం లభించింది. పరాధీన భారతం గులామీ నుండి బయటపడింది. జయ్ హింద్.

*   *   *   *

# ప్రతిఫలము

*

స్వాతంత్ర్య పోరాటంలో శాల్గొని సహజవీరత్వాన్ని ప్రదర్శించి పరాజితులై ఆంగ్లేయుల చేజిక్కిన యోధాగ్రేస రులైన చాందానవాబు ప్రభృతులను సేనల తిరుగుబాటును బలికొల్పిన జమేదారులు హావల్‌దారులను, అమానుషిక చిత్రవధలకు గురిగావించారు. బ్రిటిషు కిరాతకులు ఫిరంగి మూతులకు పెడరెక్కలు విరిచి బంధించి గుండ్లతో స్వాతం త్ర్య వీరుల దేహాలను తుత్తుమురు జేశారు. గుంపులుగా ఒకచో తోలి తుపాకి బాయులతో ప్రేల్చి ఘోరహత్యలు గావించారు. ప్రజలలో భీతిని రేకెత్తించే యుద్దేశ్యంతో ఈ నిరంకుర రాక్షసచర్యలకు గడంగినారట. దేశభక్తికి బ్రిటిష్ వారి పురస్కారమది.

దక్షిణపు విప్లవవీరుల సేనలను హైదరాలీ పంపిన పల్టనను ఉత్తరపు సేనలతో జేరనీయకుండా బ్రిటిషుగులాము హైదరాబాద్ నవాబ్ నాడు అరికట్టినందులకు దేశద్రోహం చేసి నందులకు వాని సంస్థానాన్ని విశాలంచేశారు, త్రిలింగ లోనుండి ఒకభాగం వేరుచేయబడి నవాబునకు ఉపహారంగా సమర్పించబడింది.

కంపెనీపాలనక్రింద యుండిన భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యాంతర్గతంగా భావించబడింది. అమానుషిక

కుంపిసి దురంతాల అగ్నిగుండంనుండి, భారతదేశం బయట పడింది. గ్రుడ్డికన్న మెల్లమేలుకదా. ప్రజల్లోని అసంతృప్తిని వ్యతిరేక వాతావరణాన్ని పరివర్తనంచేసేనిమిత్తం బ్రిటిషురాణి విక్టోరియా మహారాణిచే క్రీ. శ. 1858 నవంబరులో హక్కుల పత్రశాసనం ప్రచురించబడింది. అందులోని పదజాలంమాత్రం ఆశాజనకంగా గోచరిస్తుందిగాని కార్యరూపేణా పచ్చిమోసంగా తేలిపోయింది. ఉద్యోగాలు కిరస్తానీలకే, నామమాత్రానికే భారతీయులకుద్యోగం. అవిన్నీ అజాగళస్తనాలే!

చీల్చి పాలించే బ్రిటిషు ప్రభుతలో జాతిమత విభేదాల పాటించమనేది బాహ్యాప్రవచనం. హిందూ ముస్లిం విభేదాల పురికొల్పి విషమింపజేసియే పరిపాలన ఇంతకాలం నిరాఘాటంగా సాగించుకోగలిగినారు. ప్రథమ స్వాతంత్ర్యసమర పరాజయంతో ఇంగ్లీషువారు మేల్కొన్నారు. ఏర్పాట్లు అవిరామంగా దుర్భేద్యంగా కట్టుదిట్టం చేసుకోగలిగినారు. మరల విప్లవశకావిర్భావానికవకాశం లేకుండాచేశారు. సంస్థానాలను గుప్పిట్లో నుంచుకున్నారు. జవాబుదారీగల వ్యక్తుల సలహాల పాటించినట్లే నటిస్తూ పారతంత్ర్యభావాల మొలిపేయించారు. నూతన వాతావరణాన్ని నెలకొల్పుకున్నారు.

చీల్చియుంచ తీర్పుతెఱ దేశకర్త
గుటిలంలాంగ్లులు గొల్పుతే ఘటనగలవొ
తెలిసి సంక్షోభవింపుడీ! తలచినట్టి
దాస్యముక్తికి జార్చి రక్తంబు నేవి.

— 'సోమభారతం'

చరిత్ర పేర్కొన్న కారణాలివి:—

1. దేశవ్యాప్తంగా నిర్ణయించబడిన ముహూర్తం మీరటు ఘటనలవల్ల భగ్నమై అవధికిముందే తిరుగుబాటు జరగడంమూలాన బ్రిటిషువారు జాగ్రత్తపడుటకు అవకాశం లభించింది.

2. ఔరంగజేబుబాదుషా జరిపిన దురంతాలకు క్రుద్ధులై ప్రతీకారోన్మాదంతో ఉన్న సిక్కుపటాలాలు, మొగలు బాదుషా, బహదూర్ షా విప్లవ పోరాటంలో ఉన్నందున బ్రిటిషువారికి పూర్తి మద్దత్తునిచ్చాయి.

3. దక్షిణాన నైజాం బ్రిటిషువారి చెప్పుచేతల్లో గులాంమై మైసూరు పటాలాలను ముందుకు సాగనీయకుండా నిల్వరించాడు. మరికొందరు రసపుత్రులు వ్యతిరేకించారు.

4. విప్లవ సైన్యాలలో ప్రముఖపాత్ర వహిస్తూఉండిన కొందరు లంచాలకుపాల్పడి ఆంగ్లేయుల లాలూచీకి దోహదమిస్తూ విశ్వాసఘాతకులైనారు.

5. ఝాన్సీమహారాణికి సర్వసేనాధిపతిత్వం యివ్వకుండా స్త్రీయనేభావం తలపెట్టి విప్లవ పోరాటాన్ని సక్రమ సంగ్రామంలో నడపించుకోనలేకపోయారు.



# స్వాతంత్ర్య సమరచరిత్ర

*

భాషాపోషకులకు నా నివేదనము

జాతీయ విద్యాకుటీర గ్రంథమాల ప్రథమ ప్రసూనంగా ప్రచురింపబడిన "స్వాతంత్ర్య సమర చరిత్ర"ను ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము వారు (**Rc. No. 44 M. 4/57. D 12-4-57 Proceedings of the Director of Public instruction, Andhra pradesh, Kurnool.**) దయతో తే 12-4-1957 ది ప్రోసీడింగ్సులో ఆంధ్రప్రదేశ్ లోని గ్రంథాలయములు పాఠశాలలు ఉపయోగించుకోవలసినదిగా ప్రకటించి అనుమతి నిచ్చియున్నారు.

జాతీయోద్యమ ప్రధానచరిత్రమైన ఈ గ్రంథమునకు తమ గ్రంథాలయములలో ఉచితస్థానమిచ్చి ఈ సదుద్యమాన్ని ప్రోత్సహింతురని ప్రార్థించుచున్నాను.

జాతీయ విద్యాకుటీర గ్రంథమాల
గూడూరు (నెల్లూరు)
15 ఆగష్టు 1957.

జాతీయ సేవకుడు,
గుద్దేటి వీరసుబ్రహ్మణ్యం,
సంచాలక్.

# ఈ గ్రంథాన్ని గూర్చిన అభిప్రాయములు

*

**తొలిపలుకులలో**

"అశ్లే అనుభవములను 'స్వాతంత్ర్య సమర చరిత్ర' అను గ్రంథరూపమున ఆంధ్రులకు అందజేయబూనిన శ్రీ వీరసుబ్రహ్మణ్యంగారికి ఆంధ్రులెల్లరు కృతజ్ఞులై యుండవలెను."

(సం) భోగరాజు పట్టాభిసీతారామయ్య

గౌ॥ డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి—

May your book serve as a remember of those patriotic days when valunteers did not count any sacrefice too much for the attainment of Indipendence. — — — — — — — —

I once again congratulate you on the success you have achieved in presenting this to the Andhra Public in a very readable form."

(*Sd*) B. Gopal Reddy.

" 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం మొదలు స్వాతంత్ర్యం పొందేవరకు సామాన్య చదువరులకు సయితం అర్థమయ్యేటట్లు స్వాతంత్ర్య సమర చరిత్ర చక్కగా వివరించి నారు. చరిత్ర చిత్రణంలో భావోద్వేగానికి లొంగిపోయి వాస్తవిక విషయాలను విడిచిపెట్టలేదు. చారిత్రక సంఘటన లను ఎంతో జాగ్రత్తగా విశదీకరించారు............... రచయిత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న వ్యక్తి కావడం వల్ల రచనలో స్వాతంత్ర్యపోరాటం జరిపిన వ్యక్తుల స్వాతం త్ర్యభావాలు గోచరిస్తాయి."

ఆంధ్రపత్రిక — 6-1-1957

" The facts and figures given the statement made above personalities and policees are very elabrate. The experience gained by the author in his association with Andhra leaders lick Andhra Kesari Prakasam, Andhra Ratna Duggirala and his personal feeling and directness of the narrative"

Sunday Standard 24-3-57

"బహుధన వ్యయ ప్రయాసలతో సేకరించబడిన విషయములతో కూడిన మహత్తర గ్రంథమిది, భారత స్వాతంత్ర్య సమర చరిత్ర విపులముగా రసవత్తర విషయపూర్ణముగ వ్రాయబడినది. మహానాయకులు వివిధప్రాంత వీరుల చిత్రాలు ఇందు ఒక ప్రత్యేకత...భారతీయ ఉజ్వల గాథలో ఇది కీర్తిమ అధ్యాయం. ప్రతియింట ఉండవలసిన పుస్తకం."

మందాకిని 21–11–1956

"1857 సిపాయీల తిరుగుబాటు, తర్వాత పరిస్థితి కాంగ్రెసుపుట్టుక, మహాత్ముని ప్రవేశం, సత్యాగ్రహ సమరాలు, బ్రిటిషువారి నిష్క్రమణం మున్నగు వివరాలు ఇవ్వబడినవి. డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి తొలి పలుకులతో, డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారి అభిప్రాయంతో ఉన్న యీ గ్రంథం 400 పే. స్వాతంత్ర్యసమర సైనికుడైన యీ రచయిత కృషి ప్రోత్సాహనీయం.

జమీన్ రైతు 23–11–56

ఇంకను ఈ గ్రంథమునుగూర్చి పత్రికలు ప్రముఖులు తమ అమూల్యభావాల వెల్లడించియున్నారు.

సంచాలక్.